# అంకితము.

ఏవి దేశ, భాషాభ్యున్నతులకుఁ బ్రధానసాధనములో, ఏ వివిజ్ఞాన కరదీపికలై మానవుని యజ్ఞాన మహాంధకారమును బారఁదోలి సరియైనమార్గమున నడిపించునో యట్టి భాషానిలయములలో నొకటియగు మా స్తంభాద్రి పురవరసంస్థాపిత "శ్రీ జ్ఞానవిద్యుత్ప్రవాహీన్యాంధ్ర భాషానిలయము"నకు నమ్రశిరస్కుఁడనై వేవేలభిమాన భక్తిపూర్వక వందనములతో నీచిన్ని గ్రంథము నంకితముగా సమర్పించు చున్నాఁడను.

ఇట్లు,
అనువాదకుఁడు.

# సంపాదకీయము

శ్రీ వివేకానందస్వాములవారి "The real and apparent man" అను సుప్రసిద్ధోపన్యాసమున కనువాద మగు నీ "సత్యాసత్యపురుషత్వము"ను తృతీయకుసుమముగ బ్రకటించ గలిగినందులకు సంతోషమగుచున్నది. విశేషధనికుడ గాకపోవుటచే మండలియెడ విద్యాభిమానులును, ధనాధికులును తమ సానుభూతి జూపుచు యింకను విశేష విద్యాసేవజేయున ట్లను గ్రహించగోరుచున్నాను. ఇపు డతి వేలముగ సాయపడుచున్న మన్మిత్రులకును, విశేష శ్రమ గైకొని యాంధ్రీకరణముచేసిన శ్రీ వేంకటేశ్వరరావుగారికిని, నే నీ గ్రంథమాల సాపించిన నాటనుండి మహాసమర్థతతో నాకు తోడ్పడుచు కార్యభార మంతయు తామే నిర్వహించుచున్న శ్రీ రాములుగారికిని నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ఇట్లు,

మాచేటి వరవరరావు,

సంపాదకుడు.



వివేకానంద స్వాములవారు.

# శ్రీస్వాములవారి
# యుపదేశ వాక్యరత్నములు



నీవు హిందూ దేశీయుఁడవనుయభిమానముఁగలవాఁడవై యుండుము...........................................................

........................... ఓభారతీయుఁడా! సీత, సావిత్రి, దమయంతులు స్త్రీధర్మమున నీ కాదర్శ్యలని మఱవకుము. విరాగులలో నెల్ల విరాగియగు నుమాశంకరుఁడు నీ పఱదేవత యని మఱవకుము. నీ వివాహము, నీధనము, నీప్రాణము, నీయింద్రియ లోలతకును, శరీరసుఖములకొఱకును గావనుట మఱవకుము. ఆజన్మాంతము నీవు భవాని కర్పితుండవైతి వనుట మఱవకుము.................................................

................... ఓశూరాగ్రణీ! నీవు హైందవుఁడవై నందుల కభిమానము గలిగి యుండుము. 'నేను భారతీయుఁడను, ప్రతి భారతీయుఁడును నాసోదరుఁడు' అని అనుకొనుము. ఇంతేల! మూఢుఁడగు భారతీయుఁడును, పంచముఁడగు భారతీయుఁడును, నా సోదరులు' అని పలుకుము. 'చింపిరి గుడ్డలు ధరించిన (నిరుపేదలైనను) హైందవులు నా సోదరులు. హైం

దవులే నాప్రాణము. హిందూదేశపు దేవతలే నా దేవతలు. హిందూదేశము నాకు బాల్యమున నుయ్యాల తొట్టె యయ్యెఁ. యౌవనమున విలాసారామముగ నుండెను. వృద్ధాప్యమున 'బావనమగు నేకాంతప్రదేశముగనుండు' నని యుచ్చైస్స్వనముతోఁ జాటుము. 'సోదరా! హిందూదేశక్షేత్రము నాకు మహోన్నత స్వర్గతలము. హిందూదేశపు మేలే నామేల'ని నుడువుము. ఓయీశ్వరీ! ఓజగన్మాతా! పౌరుషము నొసంగుము. ఓయాదిశక్తీ! నాపిరికితనమును దొలఁగించుము. నన్ను బురుష నామర్హునిగ నొనర్పుము. అని దివారాత్రములు ప్రార్థించుచుండుము.

ఓం

# విజ్ఞాపనము

---

శ్లో॥ యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమ ధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
భగవద్గీత అ. 4. శ్లో. 7.

"ఎప్పుడెప్పుడు ప్రపంచమునందు ధర్మముతగ్గి, యధర్మము ప్రబలుచుండునో, యప్పుడెల్ల ధర్మసంస్థాపనార్థము నే నవతరించుచుందు" నని శ్రీకృష్ణభగవానుఁడు సెలవిచ్చియున్నాఁడు. ఈలాగుననే యీ యాచారము నేఁటివఱకును జరుగుచునేయున్నది. లోకులు విద్యావిహీనులును, జ్ఞానశూన్యులునై యజ్ఞానాంధకారమునంబడి పథచ్యుతులగుచుండునపుడెల్లను నొక మహాపురుషుఁడుదయించి వారికిఁ జేయూఁతయొసంగి విద్యా, జ్ఞానమనెడి దివ్వెచే నాయజ్ఞానాంధకారముం బాపి సన్మార్గగాములంజేయుచుండుట చరిత్రజ్ఞానముఁ గలవారికెల్లను దెలిసిన విషయమే. ఇట్టివారే మహాపురుషులు; మఱియు నిట్టివారి జన్మములే యవతారములు. కావుననే శ్రీకృష్ణభగవానులు గీతయందు మఱియొకచోట "ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే" యని కూడ జెప్పియున్నారు.

నేడుసానఁబెట్టి పదను పఱచిన ఖడ్గము పని లేకపోవుటచేఁ గొంతకాలమునకుఁ ద్రుప్పుపట్టి మొండివడిపోవుచుండు లాగు వనే యొకప్పుడుద్ధరింపఁబడిన ధర్మము ఆసంస్కర్త పోయిన తోడనే ప్రచారము లేకుంటమింజేసి కొంతకాలమువఱకు నాచరణయందు లేకపోవును. అప్పుడప్పుడే నూతనసంస్కర్తలావశ్యకములగుచుండురు. దేశమునందు జీవహత్యలు మెండై యజ్ఞానాంధకారమావరించుచుండినప్పుడు బుద్ధునివంటిమహాత్ముఁడుదయించి దేశోద్ధరణకై తనశరీరము నర్పించి, పతితులైన ప్రజల మరల ధర్మమార్గమునకుఁ ద్రిప్పఁగలిగెను. పిమ్మట నీలాగుననే యవసరములగునప్పు డెల్లను శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, ఏసుక్రీస్తు, లూతరు, జోరాస్టరు మొదలుఁగాఁగల నెందఱెందఱో మహాత్ములుదయించి జీర్ణమతోద్ధరణముఁ జేయుచువచ్చిరి. మరల నిక్కాలమునఁగూడ దేశములోని ప్రజలు కూపస్థమండూకములై యితఱదేశ సంపర్కము లేక మూఢులగుచున్నారు. ఒకకాలమున మనభారతజాతీయసోదరులు ప్రపంచమునం దనుపమానులై, యెల్లవిద్యలకును, కళలకును, శాస్త్రములకును బుట్టినిల్లయి నాగరతోన్నత శిఖరము నధిరోహించియుండిరి. అప్పుడు వారిభాష సంస్కృతమగుటచే నెల్లగ్రంథములును నాభాషయందే యుండెడివి. విద్యార్థు లిప్పుడాంగ్లేయ భాషయందు లేని గ్రంథమే భాషయందును లేదని తలచుచుండులాగుననే యప్పుడాదిభాషయగు సంస్కృతమునందులేని గ్రంథము ప్రపంచముననే లేకుండెను. కాలవశమున హైందవజాతి పారతంత్ర్యమునఁబడి మునిఁగి

పోవుట చేతను, రాజకీయభాష వేరగుట చేతను, ఉదరపోషణార్థము ప్రతిహిందువున కాభాషయే నేర్చుకొనవలసియుండుట చేతను, చదువుకొను కొందఱైనను నందలి సరియైన యభిప్రాయములను గ్రహించి చదువువారు కాకపోవుట చేతను, నానాఁటికి సంస్కృతము సన్నగిల్ల నారంభించెను. తుదకు మనహిందువులాత్మ గౌరవముచు విడనాడి కుక్షింభరత్వమునకు లోనై యుగ్గుపాలతోడనె యితరభాషల నేరువ నారంభించుచు, మన మాతృభాషయగు నాదిమభాషను మొదలంట నశింపఁజేసిరి. మనభాషయందడఁగి యుండిన మతాధ్యాత్మిక, భౌతికార్థిక, పారిశ్రామికాది యమూల్య విషయ రత్నముల నెల్లను మనము గ్రహింపలేక పోయితిమి. మీఁదు మిక్కిలి మన భాష. మన శాస్త్రముల వలన నితర దేశముల వారు బాగుపడి, మనమతమును మనపవిత్ర గ్రంథములనే నిశ్చయమును గ్రహింపఁజాలక ఖండించుచు తద్విరుద్ధముగఁ దమవానిని భూషించుకొనుచు, శైశవత్వముచుండి వారిభాషాసాంప్రదాయమునఁ బెఱిఁగిన మనలఁ బూర్తిగ నంధులనుగాఁ జేయుచున్నారు. మనభాషయందు మనకుఁ బూర్తిగఁ బరిచయము లేకపోవుట చేతను; మనమితరభాషా సహవాసమునం బెంపఁబడుట చేతను, మనకు మనతొంటి యౌన్నత్యము మఱచిపోయి, ఇతరుల యభ్యున్నత ప్రాశస్త్యమును గొనియాడుచు సంతోషింపవలసిన కాలగ సంభవించినది. కావుననే ప్రస్తుతకాలమున ప్రపంచమునందలి యన్నిజాతులకంటెను హిందూ జాతియందు జాతీయాభిమానము సంపూర్ణముగ నశించినది. వీని యన్నిఁటికిని వేదభాషాంత

గ్రస్థితమై పడియున్న మన గ్రంథముల యందు శ్రద్ధ వహించి యుండుటయే కారణము. కావున నె పూర్వోక్తన్యాయానుసారము ప్రస్తుతము దాదాపు గడచిన పావుశతాబ్దకాలమున నీదుస్థితి నుద్ధరింప శ్రీరామకృష్ణపరమహంసుల వారవతరించిరి. అప్పటికే మన దేశమున నానాజాతుల వారుండుటచే తాను జేయు బోధసర్వజనత సమ్మతముగా నుండుటకై ముందు తాను హిందూ, మహమ్మదీయ, క్రైస్తవాది మతముల విధివిధానముల జక్కఁగ్రహించి స్వానుభవమైన పిమ్మట సర్వజన సమాదరణీయ మగునట్లుగా "నదులెల్లను నెట్లు ప్రవహించినను తుదకా సర్వాశరణ్యమైన మహాసముద్రమునే జేరునట్లు సర్వమతములవారలును సత్యమైన భక్తిఁ గలిగి యెట్లు పూజించినను నదియా పరమాత్మనే జేరు" నని గీతయందు శ్రీకృష్ణభగవానుఁ డర్జునునకు బోధించి నట్లు జనుల కుపదేశింపఁ జొచ్చెను. వీరు చిన్ననాటనుండియే మతపరిశోధనకుఁ గడఁగుటచే విద్యాభ్యాసమున కవకాశము చిక్కకుండెను; కాని సర్వమతసారమును ప్రపంచమెల్ల యెడల బోధింపవలయునను వారి పట్టుదలను నేరవేర్చుటకై యాయీశ్వరకృపాసంభూతులైన పట్టభద్రులు, బహుభాషాకోవిదులునగు వివేకానందస్వామి, యభేదానందస్వామి, శారదానందస్వామి మొదలగు కొందఱు శిష్యులు వారికి లభించిరి. వారును స్వామి కార్య నిర్వహణా ధురంధరులై భారత నాటకరంగమున తమ విజ్ఞాన సహజతేజస్సుచేఁ ప్రకాశించుచుఁ గడచిన పావు శతాబ్దకాలమునఁ గొందఱస్తమించిరి. వారు తమదండి వేషములచే 'స్వామి' యను

నామములం బ్రఖ్యాతిఁగాంచి హిందూమతమున నాపాదమస్త కమునూతనోజ్జీవము నిడి వెలుంగఁజేయ సమకట్టి యితరఖండ ముల యందు సయితము నీమతమును వ్యాపింపజేయుటకై యుపన్యాసముల నొసంగి యుండిరి. మఱియు నిప్పుడొసంగుచు పర్యటనము సలుపుచున్నారు. తెలిసినంతవరకు వీరిలోనంద అనుఁ దముయాధ్యాత్మికశక్తి సామర్థ్యములచే జగద్విఖ్యాత కీర్తనీయులై వెలుఁగుచున్నారు. మఱియు వీరు జపాను, చీనా, అయిరోపా, అమెరికామున్నగు దేశాంతర, ఖండాంతరముల కేగి విద్యా, నాగరికతా పరిపూర్ణమునొందిన విదేశముల యందుఁ గూడ హిందూమతసంఘముల నెలకొలిపిరి. వీరి మృదు, మధుర వాగమృతధారల చేతను, హేతువుల చేతను, వాదము ల చేతను మఱియు నాధ్యాత్మిక శక్తిచేతను నాయాదేశ ముల వారనేకు లాకర్షింపఁబడి హిందూమతమును స్వీకరించిరి. ఇట్టి వీరిజన్మములచే సంకుచితము నొందిన సర్వజన శరణ్య మైన హిందూతత్త్వ రహస్యములు మరల వ్యాప్తింజెందినవి. అందు మనశ్రీవివేకానంద స్వాములవారీ వ్యాప్తికిఁ గడంగిన వారిలోను, రామకృష్ణపరమహంసుల వారి శిష్యులలోను మొదటివారు వీరత్యాగస్వామికార్యధురంధరులై, స్వార్థత్యా గమును, దేశహితచింతనయు, క్షమయు, నోర్పును, సహనము ను, సర్వసౌభ్రాతృత్వమును గలిగి యనేకములైన కష్టపరంప రల నీదుకొనుచు, ననేకపర్యాయములు మనహిందూదేశాంత ర్భాగము లేకాక, ఖండాంతరములకుఁ గూడనేగి యుపన్యసించి సర్వాత్మకమైన హిందూమతధ్వజమును నాటి కృతకృత్యులై

స్వామిఋణముఁ దీర్చుకొనిరి. ఇట్టి వీరి పావన చరిత్రమును, విరళముగఁ జదువఁగోరు మాచదువరులు శ్రీకొండిపర్తి వీరభద్రాచార్యుల వారిచే వ్రాయఁబడి యాంధ్రభాషాభివర్ధనీ సంఘమువారిచేఁ బ్రచురింపఁబడిన 'శ్రీ వివేకానందస్వామి జీవితమను నాలవ గ్రంథమునుఁ బఠింతురుగాక.

ఇట్లు స్వాముల వారిచేత నుపన్యసింపఁ బడిన యుపన్యాసము లాంగ్లేయభాషయందనేక సంపుటములుగ నిండియున్నవి. ఈస్వాముల వారిచే నారంభింపఁబడిన కార్యములచ్చటచ్చట నిప్పుడు శ్రీయభేదానందస్వాముల వారిచేఁ బూర్తిఁగావింపఁబడుచున్నవి. వీరిరువురు సమకాలీనులును, నొకేగురువుయొక్క శిష్యులునగుటచే నుపన్యాసములందలి యనేక విషయములు దాదాపు కలియుచునేయుండును. వీరిట్లు కుప్పతెప్పలుగ నుపన్యసించుచుండినను వీరియుపన్యాసములును బోధలును, తఱుచుగ నాంగ్లేయభాషయందును, నప్పుడప్పుడు సంస్కృతమునందును జేయఁబడుచుండుటచే నాయాభాషలయందు వెనుకఁబడియున్న సామాన్యజనులా యుపన్యాసముల వలనఁ గోరినట్లు లాభమును బొందఁజాలకున్నారు. ఆంగ్లేయభాష నభ్యసించినవారుఁ గూడ వారి యుపన్యాసములందలి గూఢమును గ్రహింపఁజాలనివారనేకులున్నారు. ఈలాగుననే మఱికొందఱు స్వాములు ఫార్సీభాషయం దుపన్యసించిరి. కాని యవియు సర్వజనగ్రాహ్యములుగావు. గావుననే కొందఱు విద్యాధికులీయుపన్యాసములఁ దమతమ మాతృభాషలయందు సర్వజన సులభమగు శైలిని వ్రాయుచు, నాయాభాషాసేవకుల

కొఱక యమూల్యమైన విజ్ఞానసంపద నొసంగుచున్నారు. అట్లు చేయుచుండుటయే విద్యాధికులకు ధర్మము. మనమాతృభాష యగు ఆంధ్రభాషయందింకను నాయుపన్యాసములన్నియుఁ బూమునఁ గొన్నికొన్నియుపన్యాసములు మాత్రమాంధ్రభాషయందు భాషాంతరీకరింపఁబడినవి. పూర్వోక్తసదాహృతమైన శ్రీ కొండిపర్తి వీరభద్రాచార్యులువారే పై స్వాములవారి చరిత్రయందు అయిరోపా, అమెరికా ఖండములయందు స్వాములవారిచే నొసంగఁబడిన యుపన్యాసముల సారాంశములను సంగ్రహముగ వ్రాయించియున్నారు. మఱియు నండూరి మూర్తిరాజు బి. ఏ. గారు మరికొన్ని యుపన్యాసములను మన భాషయందు భాషాంతరీకరించి యున్నారు. కావున వీరిరువురు నాంధ్రప్రపంచకమునకెంతయు నభివందనీయులు. ఈస్వాముల యుపన్యాసములన్నియు సాధారణముగ జూచుటకు శైలి నాతికఠినమై సామాన్యములైనవిగఁ జూపట్టును. కాని సంస్కృతమందైనను, లేక మఱి యే యితఱ భాషయందైనను నుపనిషదాదిగ్రంథములఁ బఠించినవారు నీ యుపన్యాసము లన్నియు “హిందూధర్మమున కాధారభూతములైన యుపనిషదాది యుద్గ్రంథముల సారాంశము”ను నాయభిప్రాయముతో నేకీభవింపక పోరు. ఈసారాంశమునకు, మూలమునకును నాంగ్లేయ వేషములను వేసి దేవభాషయగు సంస్కృతభాషాపరిచయము లేని మతాంతరులైన, ఖండాంతరులు వానిం జదివియు, వినియు, హిందూమతమున కాధారభూతములైన మూలకారణములను బాగుగ గ్రహించి, సత్యాసత్యాన్వేషణము జేసి

నిజమారయుదురని వారె యెదుటఁ బెట్టఁబడినవి. వారు నీనిశ్చయాంశములను గ్రహించిరి. కాని మన యాంధ్రులందఱింకను నా యుపన్యాసముల యమృతసారముఁ గ్రోలఁ జాలకున్నారు. మన భాషయందింకను, నాయుపన్యాసములన్నియుఁ బూర్తిగ సేకరింపఁబడియుండలేదు. సాధ్యమైనంత త్వరితగతిని, వారి వారియోపినకొలఁది ప్రయత్నము సలిపి యట్టి మహనీయుల కార్యములన్నియు (Works) విద్యాధికులు మన మాతృభాష యందుఁ బరివర్తనముఁ గావించి యితర యాంధ్రసోదరుల కృతజ్ఞతకుఁ బాత్రులుఁగావలయును. కావున మనస్వామిఁ వారిచే నుత్తరయమెరికాయందలి న్యూయార్కు పట్టణమునఁ జేయబడిన "ది రియల్ అండ్ అపియరెంట్ మ్యాన" (The real and apperant man) ను మహోపన్యాసము నిదివఱకెవ్వరు నాంధ్రభాషయందు వ్రాసియుండమిం జేసి నే నాపని నారంభింప సమకట్టితిని. నాపరిమితమగు విద్యా, విజ్ఞానములఁబట్టి నే నీ మహావిషయము నుపక్రమింప నసమర్థుండనని పూర్తిగ నెఱింగియు, నిందులకు సాహసించి నందులకు భాషాభిజ్ఞులుమన్నింపఁ బ్రార్థితులు.

ఢిల్లీపట్టణము నందలి యాంగ్లో సంస్కృత పాఠశాల యందు బూర్వము ప్రధానోపాధ్యాయులుగ నుండిన పండిత మహానారాయణను వా రీ యువన్యాసము నింగ్లీషు నుండి యురుదు భాషకు మార్చి యున్నారు. అయ్యది నాకు లభించుటచే నాంగ్లేయ భాషయందలి యాయుపన్యాసముఁగూడఁ జక్కఁగా విని యాంధ్రీకరింపఁబూని యిప్పటికిఁ

జాలకాలము క్రిందటనే ముగింపఁగలిగితిని. కాని కొన్ని యనివార్యాటంకములచే శీఘ్రముగ దానిఁ బ్రచురింపఁ జాలకపోతిని. నాకిదియే ప్రథమ ప్రయత్నమగుటచేతను, విషయ మతిగహనమై యొప్పుచుండుటచేతను, నిందేవేనిఁ గొన్ని లోపములుండిననుండవచ్చును. కావున మాచదువరులు స్వాములవారి యందలి భక్తి, విశ్వాసములచేతను వారియీయుపన్యాసము నందలి గంభీరవిషయామృత సారముచేతను దనిసి నాలోపములం బ్రోసిపుచ్చి మంచినే గ్రహింతురని వేఁడుచున్నాను.

ఈగ్రంథము నురుదూభాషయందు వ్రాయబడినదని కూడ తెలియనివారు నెచ్చటనో హిమాలయాపర్వత ప్రాంతములలోనున్న మాయావతి పట్టణమునుండి తెప్పించి నాకొసంగి, నన్నాంధ్రీకరింప ప్రోత్సాహపఱచినట్టియు, నాంగ్లేయ భాషయందలి నీ యుపన్యాసమును నాకు సావకాశముగ జదివి వినిపించి నాయుద్యమమునకు సాయపడినట్టియు బ్ర. శ్రీ. హరి బాపయ్యశర్మగారికిని, మఱియు నా యెల్ల యుద్యమములకును చేదోడు వాదోడుగా నుండు బ్ర. శ్రీ. ఇటికేల వేంకట రాజేశ్వరరావు న్యాయవాదిగారికిని తదితరస్నేహ బృందమునకును, నురుదూభాషయందు దీని భాషాంతరీకరించిన పండిత మహానారాయణగారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచు గ్రంథవిస్తరభీతిచే నీవిషయము నింతటితో విరమించుచున్నాను.

5-1-24 ఫ॥
10-10-14 క్రీ.
ఖమ్మమ్మెట్టు



ఇట్లు, భాషాసేవకుడు
జములాపురపు (మాదిరాజు)
వేంకటేశ్వర రావు

నేనీ మహారోపన్యాసమును బరివర్తనముగావించి క్రీ. శ. 29-12-11 న ముగించినను నేటివఱకు కారణాంతరములచేఁ బుస్తకరూపమునఁ బ్రకటింపఁజాలనైతి. ఇప్పుడు దీనిఁ గ్రంథరూపమునఁ బ్రకటింపవలయునని నాకు సంకల్ప ముదయింప నేన క్కార్యమునకుఁ గడంగితి. అంత శ్రీవేంకటేశ్వరగ్రంథమాలాధికారులగు బ్ర.శ్రీ. చిలుకూరు శ్రీరాములుగారు ప్రసంగవశమున నీవిషయమును దెలిసికొని యీ గ్రంథమును దమకొసంగుడనియు; దమగ్రంథమాలయందుఁ దృతీయకుసుమముగఁ బ్రకటింతు మనియుఁ గోరిరి. స్నేహవాత్సల్యముచే వారి కోరిక నంగీకరించి యీకరగ్రంథము మొదటికూర్పును వారిమండలికెంతయు సంభరితోత్సాహముతోఁ గృతజ్ఞతా పూర్వకముగ సమర్పించుకొనుచున్నాఁడను.

తుద కొక్క చిన్న విషయము మనవి చేయ వలసి యున్నది. శ్రీ స్వాములవారి చిత్రపటమును విశేష పరిశ్రమచేసి కలకత్తాయందలి ఉద్బోధినీ ఆఫీసునుండి తెప్పించి నాకొసంగిన ఆంధ్రాభ్యుదయ పత్రికాధిపతియగు బ్ర.శ్రీ. కోకలసీతారామశర్మగారికిని, పూర్వోక్త కంపినివారికిని, తమమండలియందు నాయీ చిన్నిగ్రంథము నాధారముగాఁ గైకొని ప్రచురించిన వెంకటేశ్వర గ్రంథమాలాధికారులకును, సత్వరముముద్రణాకార్యమును నెఱవేర్చి గ్రంథమునొసంగిన వాణీముద్రాక్షరశాలాధికారులకును, అచ్చు చిత్తులు దిద్దుటయందు నాకుఁదోడుపడిన బ్ర.శ్రీ. వేముగంటి రామకృష్ణారావు న్యాయవాదిగారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడ.

ఇట్లు,

18-12-25, ఎల్లువాలెం. జ. వెంకటేశ్వరరావు.



ఓం

# శ్రీ సత్యాసత్య పురుషత్వము.



మనము నిలచియున్నాము. మనదృష్టి ముందునకు ప్రసరించుచున్నది. అదికొన్ని సమయములయందు మైళ్ళదూరము సహితమవలీలగ వ్యాపించుచుండును. తనయందు విజ్ఞానముత్పన్న మైనప్పటినుండి మానవుఁ డీకార్యమును జేయుచునేయున్నాడు. ఆతఁడెల్లపుడు భవిష్యద్విషయమును గూర్చియే విచారించుచుండును. మనయీయాయుపాధినశించినపిదప మనమేమగుదుమను విషయమును గనుఁగొనవలయునని యాతఁ డెల్లప్పుడుఁ గోరుచుండును. ఈసమస్యా విస్పష్టతకై వివిధ సూత్రములల్లఁబడినవి. సిద్ధాంతములపై సిద్ధాంతము లుపపాదింపఁబడినవి. ఒకశాసనముతరువాత వేఱొక శాసనము తొలఁగింపఁ బడుచున్నది. మానవుఁడెంతవఱకీవిషయమును గూర్చి విచారించుచుండునో ప్రపంచమెంత వఱకు స్థిరముగనిలచియుండునో యంతవఱకీలాగుననే జరుగుచుండును. అయిన నీవిధానములయందుఁ గొంతవఱకైన సత్యముండుటావశ్యకము. కాని వీనియందనేకములసత్యములు. నాచే నీవిషయమునం దిండియాదేశమున బరిశోధింపఁ

బడినవాని పర్యవసానములను సమూహమును మఱియు నభిప్రాయములను మీకు నివేదింపఁబూనుచున్నాను, కాలక్రమమున హిందూదేశమందలి విద్వాంసులచే గ్రహింపఁబడిన వివిధాభిప్రాయముల నీవ్యాసమున సమావేశపరచుటకై ప్రయత్నింపఁబూనుచున్నాను. తత్వశాస్త్రము నాధ్యాత్మిక శాస్త్రముతోఁ గలుపుచు సాధ్యమైనంత వఱకువీని నాధునిక విద్వాంసులయభిప్రాయములతో నేకీభవింప జేయుటకై ప్రయత్నించెద.

ఏకత్వమును కనుఁగొనుటయే వేదాంత తత్వమునందలి యొకముఖ్యాభిప్రాయము. హిందువులయొక్క విజ్ఞానంచిన్న చిన్న ప్రత్యేకాంతర్విషయముల లెక్క సేయునది కాదు. వారెల్లప్పుడు సర్వజన శరణ్యమైన మహావిషయమునుఁ గూర్చియే విచారించుచుందురు. ఏవస్తువును కనుఁగొనుటవలన యెల్లయితరవస్తువులను దెలియనగునో? యనునదొకవిషయము. ఉదహరణార్థము:- మంటిగడ్డనుగనుఁగొనుట చేనామట్టితో జేయఁబడునెల్లవస్తువులమర్మములును దెలియబడును. ఈలాగున నేయీస్థూలప్రపంచమున కాధారభూతమైన వస్తువేదియో? ఏవస్తువును గనుఁగొనుటవలన యీ ప్రపంచమంతయు దనకుఁదానే స్వయముగఁ దెలియఁబడునో యనునదొక విధమైన పరిశోధనము. హైందవ తత్వవేత్తల యభిప్రాయానుసారము ప్రపంచమంతయు నేకపదార్థముగ మారఁగలుగును. దానినే వారాకాశమందురు. మనము మన చుట్టుప్రక్కలఁగాంచునట్టియు, గ్రహించునట్టియు, స్పృశించునట్టియు ప్రతిపదార్థము నాయాకాశమునుండి బయలువెడలు ప్రత్యక్షభిన్నరూపమే. అది సర్వావకాశములంగప్పి యతిసూ

స్థ్రమైయుండును. మనము గాంచుచున్న ఘనపదార్థములు, ద్రవపదార్థములు, వాయుపదార్థములు, శరీరము, రూపము, భూమి, సూర్యుఁడు, చంద్రుఁడు నక్షత్రములు మున్నగు నెల్ల పదార్థములు నీయాకాశమున నే మిశ్రమమైయుండును.

సృష్టి నిర్మాణమునకై యీయాకాశముమీఁదఁ బని చేయుఁ బదార్థమెద్ది? ఆకాశముతోఁగూడనొక సర్వవ్యాపకమైన శక్తియుఁగలదు. ఏశక్తి వలన ఈసృష్టిస్థిరముగనిలిచియున్నదో మఱియు దేనివలన ఆకర్షణము తనపనిచేయుటయేగాక సంకల్పము (Thoughts) లుదయించుచున్నవో, యవియన్నియు నాశక్తి యొక్క చిత్రములే. దాని నేహిందువులు ప్రాణమందురు. యీ ప్రాణమే యాకాశముమీఁదఁ బనిసేయుచు సృష్టిరచన చేయుచున్నది. కల్పాదియందీ ప్రాణము అనంతమైనయాకాశ మహాసముద్రమునందు నిద్రావస్థనుండును. ఆదియందిది చలనము లేక నిశ్చలముగనుండును. తరువాత నాయాకాశ సముద్రమున ప్రాణముయొక్క పనిసేయుటవలన యొకకంపన (Vibration) ముదయించును. ఈ ప్రాణము చలనము సేయ నారంభించినప్పుడు ఈ సముద్రమునుండి నానావిధములైన శరీరములు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు. భూమి, మానవుఁడు. తిర్యక్కులు, జడములు, వృక్షములు ఇత్యాదియెల్ల విధములైన శక్తులును, నానారూపములైన యాకారములును వ్యక్తమగు చున్నవి. కావున శక్తియొక్క ప్రతియభివ్యక్తరూపమును వారివారి యభిప్రాయానుసారము ప్రాణమే యైయుండును. మఱియు ప్రతిభౌతికాభి వ్యక్తరూపముఁగూడ నాయాకాశమే. ఈకల్ప

మంతమగునప్పుడు మనచే ఘనపదార్థమనఁ బడుచుండు ప్రతి వస్తువును పరిణామమునొంది వేఱురూపమును దాల్చును. ఆ రెండవ దివ్యమైన రూపమే ద్రవపదార్థ రూపము. మరలనది వాయురూపముగ మారును. పిమ్మటనది దానికంటెను మిగుల సూక్ష్మరూపమును దాలిచి, కంపనముతోఁగూడి యొక విధమగు యుష్ణమగును. తరువాత నది స్వస్వరూపమైన యాకాశముయొక్క స్థితియందు పరిణమించును. మనచేఁబిలువఁబడు ఆకర్షణము, చలనము, కంపనము మొదలగు పదార్థములెల్లను క్రమక్రమముగ నా నిజమైన ప్రాణముననే లయమగును. ఈ విధమున యెడతెగక ప్రవృత్తి, నివృత్తులు పరంపరా జనితములై యొప్పుచుండును. అనఁగా నొకప్పుడు వ్యాప్తమైయున్న పదార్థము మరియొకప్పుడు సంకుచిత మగుచును, ఒకప్పుడు సంకుచితముగనున్న వస్తువు వేఱొకప్పుడు వ్యాప్తము నొందుచునుండును. వ్యాప్తమనఁగా దృశ్యము. సంకుచితమనఁగా వదృశ్యము. దీనినే ప్రకృతిశాస్త్రీయ సాంకేతిక పదములలో నిట్లు చెప్పుదురు, అదియొకకాలమున దృశ్య మగుచుండును. వేఱొకకాలమున మఱుఁగువడి పోవుచుండును. లేక యొకవేళ నిరర్థకమును, ప్రాలుమాలినదియును, మఱియొకవేళ కార్యకారియును, చుఱుకుఁదనముఁ గలిగినదియు నగుచుండును. ఈమార్పులెల్లప్పుడు నీవిధముగనే కలుగుచున్నవి.

అయిన నీపృథక్కరణము గూడ సంకుచితమే. ఈలాగుననే యాధునిక ప్రకృతిశాస్త్రముగూడ నీవిషయమున విశేషముగఁ బరిశోధనము చేసియున్నది. ఇంతకుమించి ప్రకృతిశాస్త్ర

ములు పరిశోధన చేయంజాలవు. అయిన నీపరిశోధనము నిజ ముగ కట్టుబడి యుండలేదు. ఏపదార్థమును కనుఁగొనుటవలన మిగిలినప్రతివస్తువును కనుఁగొననగునో యట్టి పదార్థమును మనమింకను తెలిసికొనకున్నాము. మనము ప్రపంచమునంతను రెండుభాగములుగ విభాగించితిమి. మనము వానిని జడము, శక్తియునందుము. హిందూదేశపు ప్రాచీనపండితులు వీనిని ఆకాశము ప్రాణమునందురు. పిమ్మట నాకాశము, ప్రాణములను వాని నిజస్థితులకు మార్చుటయే. ఈరెంటి నింతకంటె నుత్తమ పదార్థమునకు మార్పనగును దానినే మనస్సందుము. మనస్సు లేక మహత్తు నుండియే యీ రెండు పదార్థములు పుట్టినవి. ఇదియే ప్రపంచమునంతటను వ్యాప్తమైయున్న మానసికశక్తి. ఈ మహత్తే ప్రాణమునకంటెను, ఆకాశమునకంటెను అతిసూక్ష్మమైనసృష్టిని వ్యక్తీకరించుచున్నది. ఈ చిచ్ఛక్తియే రెండుపదార్థములుగ విభజింపబడినది. ఇదియే భిన్నరూపముల నొంది ఆకాశము, ప్రాణములయొక్క రూపమున పరిణమించిన దనునట్టి సాధారణాభిప్రాయము మొదటి నుండియే కలదు. ఈ సృష్ట్యోత్పత్తికి రెంటియొక్క సంయోగమే కారణము,

మరలమనము ఆధ్యాత్మిక విద్యావిషయమునకువత్తము నేను మీవంకఁ జూచుచున్నాను. స్థూలదృక్కులు నేత్రముల ద్వారా నావఱకు వచ్చుచున్నవి అవి యింద్రియనాళములద్వారా మెదటివఱకు వ్యాపించుచున్నవి. స్థూలనేత్రము దృష్టియొక్క యవయవము కాఁజాలదు. అదియొక బాహ్యగోళకము. (ఉపకరణము) ఏలయన:—దృక్ఛక్తిని మొదటివఱకు, గొంపోవు వెను

కటినిజావయవమొకటి నశించినచో నాకిరువది నేత్రము లుండియు నేను మిమ్ముఁ జూడఁ జాలకుందును. అవయవము తనగోళకమునుండి భిన్నమైయుండును. గోళకములేక బాహ్యనేత్రమునకు వెనుక అవయవముండును. కావుననే యక్షికము(Retina) (దృష్టి విజ్ఞానముండు నేత్రముయొక్క మొదటిపొర) యొక్క రూపమెంత పరిపూర్ణముగ నిర్మింపఁ బడినను నేను మిమ్ములఁ జూడఁ జాలకుందును. ఈలాగుననే శరీరమునందు ప్రతి యింద్రియమువెంట నొక బాహ్యోపకరణమును, దానికి వెనుక నొక యవయవమును నిర్మింపఁబడియుండును. అయిననీ రెండు పదార్థములు మాత్రమే పనిచేయఁజాలవు. నేను మీతో మాటలాడుచున్నాననియు మీరు నామాట మిగుల శ్రద్ధమై వినుచున్నారనియు ననుకొనుఁడు. మధ్యనేదోయొక విషయము ఘటిల్లును. అనఁగా నొక ఘంట శబ్దింపఁబడిన దనుకొనుఁడు. ఆగంటయొక్క శబ్దమును మీరు వినకపోవచ్చును. ఆశబ్దము యొక్క ధ్వని మీకర్ణమునందుఁ జొచ్చినది; మీశ్రవఃపుటమును డీకొనినది, మఱియు నది జ్ఞానతంతువులద్వారా మెదటివఱకు వ్యాపించినది. అయినను మీరు వినకున్నారు. ఈశక్తిని మెదటివఱకు వ్యాపింపఁజేయఁజాలిన పనియంతయుఁ జేయఁబడియు దానిని మీరేల వినకున్నారు? అనుప్రశ్నయొకటి యిచ్చట నుత్పన్నమగునుగదా. అప్పుడు వీనితోఁబాటు మఱియొక పదార్థమావశ్యకమనియే చెప్పవలసి వచ్చును. మనస్సుయొక్క శ్రద్ధ యిటువైపు లేకుండెను. ఇదియే యామఱియొక పదార్థము. మనస్సీ యవయవమునుండి భిన్నమై యుండునప్పుడు మెదడు

దాని చెంతకెట్టి విషయమును గొనిపోయినను యది దానినివిశ్వ
సింపకుండును. అది ఆయవయవమువైపు శ్రద్ధవహించి యుండు
నపుడుమాత్రమే ఆవిషయము మనస్సువఱకు వ్యాపించును. ఇప్ప
టికిని సంపూర్ణత నొందలేదు. ఉపకరణము బయటినుండి శక్తు
లను గొనివచ్చినను, అవయవము వానిని లోనికిఁ గొనిపోయి
నను మనస్సు ఆ అవయవముతో నేకమైనను అభిప్రాయము
పూర్తిగ వ్యక్తము కాఁజాలకుండును. ఇచ్చట మఱియొక
పదార్థమావశ్యకము. అదియే పునరాగమము (Re-action)
లోనికిఁ గొనిపోఁబడినవిషయము పునరాగమ మొందును. ఈ
పునరాగమముతోడనే యావిషయము సుబోధకమగును. బయ
టనుండిన వస్తువు వేఱొకపదార్థము ద్వారా మెదడులోనికి
వ్యాపించును. మనస్సుదానినిఁ గొనిపోయిబుద్ధికి నివేదించును.
అదియేదానికి పూర్వముండిన గుణములతో మిశ్రమమొందించి
మరల మరలుట కొకమార్గమును గల్పించును. ఈ పునరాగ
మముతో జ్ఞానముగూడ నుండును. పిమ్మట యిచ్చ. ఛాయను
పునరాగమ మొందించు మానసిక పరిణామస్థితియే బుద్ధియనఁ
బడును. అయిననిప్పటికిని పూర్ణము కాఁజాలదు. మఱియొండు
నావశ్యకమును గలదు. ఇచ్చట ఛాయాగ్రహణ యంత్ర మొందు
గలదనుకొనుఁడు. మఱియు గుడ్డయొక్క జవనికయు నొకటి
గలదు. ఆతెరపైనొక పటముయొక్క ఛాయను దీయుటకై
ప్రయత్నము సలుపవలసిన నేనేమి సేయవలయును? నేను కాంతి
యొక్క భిన్నములైన కిరణములను జంత్రిముద్వారా జవని
కపై ప్రసరింపఁజేయుదును. వానినొకచోఁ జేర్తును. పటమును

వేయుట కనువగు వస్తువేదైన గ్రహించుటయుఁ గూడ నావశ్య కము. ఆవస్తువు నిశ్చలమై యుండవలయును. ఏలయన:—తీవ్ర చలనముచేయు పదార్థముపై నేనుపటమును వేయఁ జాల కుందును. కావున నాపదార్థము నిశ్చలమయ్యే యుండి తీరవల యును. నేనుదానిమీఁద ప్రసరింపఁజేయు కాంతియొక్క కిరణ ములు కంపనము సేయుచుండును. ఈ కంపనము చేయుచుండు కాంతియొక్క కిరణములు చలనములేక స్థిరముగనున్న పదార్థ ముపైననే ప్రసరింపఁ జేయవలయును. లేక సమీకరింపఁ జేయ వలయును; లేక పరిపూర్ణము నొందింపవలయును. మన అవ యవములవలన లోనికిఁ గొనిపోఁబడునట్టియు మనస్సునకు నివే దింపఁబడునట్టియు, నామనస్సు ద్వారాబుద్ధివఱకు వ్యాపింపఁ జేయఁబడునట్టియు నగుశక్తుల స్థితియుఁగూడ నిదియే. ఈకార్య మునకు వెనుక రూపపటమునకనుకూలమైనఅనఁగామనముభిన్న మైనశక్తులనెల్ల దానిపై నేకముచేయుట కనుకూలమగు నిశ్చల మైన యాధారపదార్థ మొకటి యుండువఱకును నది పూర్ణము కాఁజాలదు. మన యస్తిత్వముయొక్క రూపాంతరములనెల్ల నొకచోఁ జేర్చువస్తువేది? ప్రతిసముసమును చలించుచుండు వస్తువుయొక్క రూపమును స్థిరముగనుంచు పదార్థమెయ్యది? ఏవస్తువుపై మన వివిధశక్తులెల్లను సమకూరుచుండునో, మఱియు నేదియన్నిటికినియొకరూపమును నిర్మింపఁజాలునో యావస్తువెద్ది? ఈవిషయ సారాంశమును గ్రహించుటకై మఱి యొండుపదార్థ ముండు టావశ్యకమని మనకు బోధపడుచున్నది. మఱియునది శరీరము, మనస్సునననుసరించి చలనమొందక నిశ్చలమై యుండ

వలయున నెడి విషయముఁగూడ మనము జూచుచున్నాము. ఛాయాగ్రహణ యంత్రము పటమును నిర్మించుట కనుకూల మగు గుడ్డయొక్క జవనిక, కాంతియొక్క కిరణముల ననుసరించి యచలపదార్థమే; లేనిచోదానిపై పటనిర్మాణము కాఁజా లదు. అనఁగాదానిని గ్రహించున దవశ్యము వ్యష్టిపదార్థము. ఏవస్తువుపై నీమనస్సు ఎల్ల పటములను నిర్మించు చున్నదో, దేనిపై మనస్సుచేతను, బుద్ధిచేతను గాని రాఁబడిన శక్తులెల్లను ప్రయోగింపఁబడుచున్నవో, స్వీకరింపఁబడుచున్నవో, యొకచోఁ జేర్పఁబడుచున్నవో యదియేమన యీ పదార్థము; దానినే మానవుని యాత్మయనుచున్నారు.

ఆకాశమనియు, ప్రాణమనియు విభాగింపఁబడిన పదార్థము సర్వవ్యాపకమైన మనస్సని (universal cosmic mind) మనము కనుఁగొంటిమిగదా. మఱియు మనము మనలో నీమన స్సునకతీతమైనఆత్మయను వేఱొకపదార్థమునుకనుఁగొందుము. ఈ ప్రపంచమునందు సర్వవ్యాపకమైన మనస్సు (universal mind) నకు వెనుకనొక యాత్మగలదు. ఆయాత్మయే నిత్య మైన పదార్థము; అదియే యెల్లప్పుడును జీవించియుండును; మఱియునదియే పరబ్రహ్మమనిపించుకొనును. ప్రతిమానవుని యందును ఆపురుషత్వముయొక్క ఆత్మ ప్రకాశించుచుండును. ఈసృష్టియందుసర్వవ్యాపకమైనమనస్సువలెనాగునఆకాశముప్రాణ ములరూపమున వ్యక్తమగుచున్నదో అలాగుననేపరిపూర్ణమైన యాత్మ మనస్సురూపమున వ్యక్తమగుచుండుట మనముగాంచు చున్నాము. నిశ్చయముగా మానవుని దీస్థితియేనా ? శరీరము

నుత్పత్తిఁజేయఁజాలు మనస్సిదియేనా? ఆతనియొక్క ఆత్మ ఈ మనస్సువలన జన్మింపఁబడినదియేనా? అనఁగా అతనియొక్క శరీరము, మనస్సు, ఆత్మ యనునవిమూఁడు నొకటియేనా? కాక నవియన్నియు నేకపదార్థముయొక్క భిన్నావస్థలా? మనము పోనుపోను ఈ ప్రశ్నమున కుత్తరమొసంగబడుదుము. స్థూలశరీరమొకటి గలదనియు, నాశరీరమునకు వెనుక అవయవము మనస్సు, బుద్ధియుఁ గలవనియు వీని యన్నిఁటికిని వెనుక నాత్మగలదనియు మనమిప్పటికిఁ దెలిసికొనిన మొదటియంశము. అన్నిఁటికంటెను ముందు మనకు అత్మ శరీరము, మనస్సునకునుగూడ విలక్షణమై యొప్పుచున్నదను విషయము చక్కఁగా ద్యోతకమగుచున్నది. ఈ సమస్యపై మతములందుఁ గొన్ని భిన్నాభిప్రాయములు గలవు. ఈ భిన్నాభిప్రాయమునకు కారణమేమన: సాధారణముగ ఆత్మసగుణమని ద్వైతవాదుల యభిప్రాయము అనఁగా ఆత్మ భిన్నగుణపరిపూర్ణమనియు, సుఖదుఃఖములకాత్మ సంబంధము గలదనియు వారి మతము. అద్వైతవాదులు ఆత్మ సగుణమని యొప్పుకొనరు. వారు దానిని నిర్గుణమందురు.

మొదట ద్వైతవాదులను గూర్చి చర్చింతమురండు. ఆత్మనుదాని యదృష్టము ననుసరించి వానిస్థితి మీ ముందర నివేదింతును. పిమ్మట వారికి విముఖమైన మార్గమునకు వత్తము. తదుపరి దాని నద్వైతవాదుల మతప్రకారమున సమర్థించుటకై ప్రయత్నింతము. ఈశరీరమునకును, మనస్సునకు నతీతమై వెలయు పదార్థము గావున మానవుని యీ యాత్మ నశింపకనిత్యమై ప్రకాశించుచుండు టావశ్యకము. ఇది ఆకాశము, ప్రాణము

తోఁగూడిన మిశ్రపదార్థమును గాదు. నశించునదనఁగా నష్టమైపోవునది. మిశ్రపదార్థములుమాత్రమే నశించుచుండును; మూలపదార్థమునశించుటయసంభవము. రెండుమూఁడుద్రవ్యములసంయోగముచేఁగలిగినవస్తువుమిశ్రపదార్థము. అది యేతప్పక నష్టమగును. ఇతఱ యేపదార్థముచేతను మిశ్రమముకానిది మూలపదార్థము. ఒక్క అదిమాత్రమే నష్టము కాఁజాలదు. కాఁబట్టి దానికి నాశము లేదు. అది నిత్యము. అదియెల్లప్పుడును నిండియే యున్నది. అదియెప్పుడును జన్మింపదు. దానికి జన్మము లేదు. సృష్టియందలి ప్రతివస్తువు నొక మిశ్రమపధార్థమే ఏలయన:— ఎవ్వుడును యెవరును గాని నాస్తినుండి యస్తిపుట్టుట చూడరు గదా! అనఁగా శూన్యమునుండి యేపదార్థము పుట్టఁజాలదు. ఎల్లప్పుడును వర్తమానవస్తువులతోఁ గలసి నూతన రూపముల దాల్చుచుండునదియే యీస్థూల ప్రపంచమని మన మెఱుంగుదుము, కాఁబట్టి మూలపధార్థమైన మానవునియాత్మ యెల్లప్పుడునుండును. ఈశరీరము నశించిన తరువాతఁగూడ నదియుండును. దానికి నాశము లేదు. వేదాంతుల యభిప్రాయానుసారము ఈశరీరము నష్టమైనతోడనే మానవునియొక్క బాహ్యశక్తులు మనస్సునందుఁ బోయిచేరును. మనస్సు ప్రాణమందు లీనమైపోవును. పిమ్మట నాప్రాణము మానవుని యాత్మయందైక్యమగును, అప్పుడు మానవునియాత్మ వేరొకపదార్థ సమ్మేళనముచే బయలు వెడలును. దీనినే దివ్యశరీరము, కారణశరీరము లేక యాధ్యాత్మిక శరీరమందురు. లేక మీాయిష్టానుసారము దానిని మఱేమైన యనుఁడు. ఈ శరీరమునందు మానవుని వాసన

లుండును. వాసనలనఁగా నేమి? ఈమనస్సునొక కొలనుగా భావించిన దానియందలి ప్రతిసంకల్పమును కొలనుయం దుప్పతి ల్లునొక యలవలెనుండును. కొలనియందు లేచి వెంటనే నశించు తరంగములవలెనే ఇచ్ఛాతరంగములెల్లప్పుడును మనస్సునం దుదయించి నశించుచుండును, కాని యవి యెల్లప్పటికి నదృశ్య ములు కాఁజాలవు. సూక్ష్మాతి సూక్ష్మములై పోవుచుండును. అయినను నవియన్నియు నిలచియుండి విచారించునపుడెల్లను మ రల ప్రత్యక్షమగుచునేయుండును. జ్ఞప్తి లేక జ్ఞాపకము అనఁగా సూక్ష్మస్థితిలోనికి మారిన కొన్నియభిప్రాయములను తరంగములరూపమున వ్యక్తపఱుచునట్టి యొకశక్తి. ఈలాగుననే మనము విచారించు ప్రతియొకవస్తువును, మనచేఁజేయఁబడు ప్రతి యొక కర్మయు మనమనస్సునందు నాటుకొనియుండును. ఇవి యన్నియు నచ్చట సూక్ష్మరూపముననున్నవి. ఒకమనుష్యుఁడు దేహాంతమొందునప్పుడీశక్తులయొక్క సంఘీభావమంతయు నాత ని మనస్సున గుమిగూడి ముందించుక సూక్ష్మ పదార్థములపై తన పనిని జేయుటకాధారమగును. మఱియు నాత్మసంకల్పముల యొక్కయు, సూక్ష్మశరీరముయొక్కయు వసనమును ధరించి బయటికి వెడలును. ఈయాత్మయొక్క యదృష్టము ఈ భిన్న శక్తులన్నిఁటియొక్క క్రియాఫలితమువలన మార్గదర్శియగును. అదియేభిన్నశక్తుల వలన వ్యక్తమగును. ఆత్మకై మూఁడువిధము లైన గమ్యస్థానములు గలవు.

అందాధ్యాత్మికాభివృద్ధియొక్క ఉచ్చసౌధాగ్రము నధి రోహించిన మానవులు మొదటివారు. వారు మృతినొందున

ప్రడువారి యాత్మలు సూర్యకిరణములద్వారాపోయిసూర్యలోక
మును జేరును. ఆలోకమునుండి చంద్రలోకమునందుఁ బ్రవేశిం
చును. అచ్చటినుండి విద్యుల్లేఖయొక్క భిన్నరూపములద్వా
రా వెళ్లుచుండును. అచ్చట నవి పూర్వముకంటె పుణ్యప్రదమైన
లేక పవిత్రవంతమైన మఱియొక యాత్మతోఁ గూడును. ఆ
యాత్మ యీ నవీనాగంతుకాత్మకు మార్గదర్శకమై లోకము
ల కెల్ల నూర్ధ్వలోకమనఁబడు బ్రహ్మలోకమును జేర్చును. అచ్చట
నాయాత్మలకు సర్వశక్తిత్వ, సర్వవ్యాపకత్వ, సర్వజ్ఞత్వాదిలక్ష
ణంబులుగలిగి కొంచెము మించుమించుగ పరబ్రహ్మమును బోలిన
శక్తిగలవై యొప్పుచుండును. ద్వైతవాదుల యభిప్రాయానుసా
రము అవి యచ్చట నుండును. అద్వైతవాదుల మతానుసార
మవి కల్పాంతమున ఆ సర్వవ్యాపకత్వమునం దైక్యమునొందును.
ఏదోయొక కామ్యార్థము పుణ్యకర్మల నాచరించువారు రెండ
వవారు. ఈపుణ్యకర్మల ఫలితార్థము వారి యాత్మలు చంద్ర
లోకమునకుఁ బోవును. అచ్చట ననేక స్వర్గములు గలవు.
అచ్చటవానికి దేవతాసంబంధమైన సూక్ష్మశరీరములులభించును
దేవతలై యచ్చట నుందురు. చాలాకాలమువఱకు స్వర్గలోకసౌ
ఖ్యముల ననుభవించు చుందురు. ఈ కాలము ముగిసినపిదప
పూర్వకర్మలయొక్క ఫలితముచే నవిమరల భూమిమీఁదికి వచ్చు
ను. అవి వాయువు, మేఘము మొదలగు నెల్లమండలములనుండి
గడచి తుదకు వర్షధారలమూలమున భూమిమీఁదికి వచ్చును.
అచ్చట నవి సస్యములతోఁగలియును, ఆసస్యములను మానవుఁడు
భుజించి నూతనోపాధి నిర్మించుట కనువగు స్వత్త్వమునొంద

గూర్చు సామర్థ్యమును సంపాందిచును. కడపటివారు అనఁగా మూఁడవ వారు లేక దుష్కర్ములు మృతినొందునప్పుడు భూత ప్రేతములగుదురు. ఈ భూమికిని, చంద్రలోకమునకును మధ్య నెక్కడనో నివసింతురు. కొందఱు మానవునకు లాభమును మఱికొందరు నష్టమును గలిగింతురు, అచ్చటఁ గొంతకాలముం డినపిదప వారును భూ మీఁదికి వచ్చి జంతువు లగుదురు. కొం తకాలము మృగోపాధియందు గడపినపిమ్మట వారు విముక్తి నొంది మరల మానవరూపమును దాల్తురు, ఈవిధమున ముక్తి నీఁగాంచు కర్మల నాచరించుటకై వారికి మరల నవకాశము చిక్కును. సంపూర్ణత్వమునొందిన మనుష్యుఁడును-మిగులకొంచ ముగాపాపమునిలువయుండినమానవుఁడునుసూర్యకిరణములద్వా రమున బ్రహ్మలోకమునఁజేరును. స్వర్గలోకమునకుం జనునుద్దేశ ముతో నేదేని కర్మ నాచరించువారు మధ్యమ తరగతివారు వారు చంద్రలోకము ద్వారమున స్వర్గమును చేరుదురు. అచ్చ ట దేవతా శరీరములు బొందుదురు. అయినను వారును తిరిగి పురుషత్వము నొందవలసివచ్చును. పరిపూర్ణత్వము నొందుట కు మరల నొకయవకాశమొసంగఁబడును.

ఈభూమి కర్మభూమి .లేకకర్మలోకమనఁబడును. ఇచ్చట మాత్రమే మానవుఁడుసత్కర్మలుగాని దుష్కర్మలుగాని చేయు చున్నాఁడు. స్వర్గలోకము బొంద నిచ్ఛగల మానవుఁడు ఆయి చ్ఛాసంపూర్తికొఱకు సత్కర్మల నాచరించినచో నాతఁడు దేవ తయగును. అచ్చట మాత్రము నూతనకర్మలను జేయక భూమి పయింజేసిన సత్కర్మలఫలము ననుభవించుచుండును. ఈన క

ర్మలఫలము వ్యయపడినతోడనే తొలిజన్మమునందు జేసిన పాప కర్మలఫలమాతని నావరించును. అదిమరల నాతని నీప్రపంచకము నకుఁ దోడ్కొనివచ్చును. ఈలాగుననే భూత ప్రేత రూపములు దాల్చిన మానవుఁ డా రూపముననే యుండి నూతనకర్మల నాచరింపక గతించిన దుష్కర్మల పాపఫలము ననుభవించుచుండును. తరువాత మరల కొంతకాలమువఱకు నూతనకర్మ లేక యేదోయొక జంతుశరీరమునందుండును. పిమ్మట నీనియమిత కాలము గడచునప్పటికి మరల మానవుఁడగును. పుణ్యపాప కర్మల ఫలితముల ననుభవించు స్థితులు నూతనకర్మల నాచరించుట కనర్హములు. ఆసమయములు సుఖ దుఃఖముల ననుభవించుటకు మాత్రమే యనుకూలములై యుండును. ఏదేనియొక పుణ్యకర్మగాని లేక పాపకర్మగాని చేయఁబడినప్పుడు వెంటనే తత్ఫలము గోచరమగుచుండును. దృష్టాంతముగా జూడుడు:— తన జీవితకాలమంతయు దుష్కర్మములచేఁ గడపిన యొకానొక మనుష్యుఁడు ఒక్క సత్కర్మమును మాత్ర మాచరించిన యెడల ఆపుణ్యఫలము తత్క్షణమే వ్యక్తమగును. ఆఫలము సంపూర్తియైనతోడనే పాపకర్మల పర్యవసానములు తమఫలితములఁజూపుచుండును. ఎవరు ప్రత్యేకములైన పుణ్యకర్మలను మఱియితర మహాకార్యముల నాచరింతురో యెవని జీవితముసాధారణముగ సత్ప్రవర్తనమువలన చక్కఁజేయఁబడియుండునో వారు దేవత లగుదురు. కొంతకాలము దేవతాశరీరములందుండి దేవతాశక్తుల యందలి సారముఁగ్రోలిదపవారు మానవత్వమును ధరింపవలసి వచ్చును. ఈలాగున పుణ్యఫలము వ్రయపడినంతనేతొల్లిఁటిపాప

ములు తమకార్య తకరణముగావింప సిద్ధమగును. ఆకస్మికముగ దుష్కర్మాచరణ మొనరించినమానవులుసహితముభూత, ప్రేతశరీర ధారణము సేయ వలసివచ్చును. అతని పావ కర్మఫలము దూర మైనపిదప శేషించియాతని వెంటనంటియున్న యాకించిత్పుణ్య ఫలమాతనిని మరల మానవునిగ జేయును. బ్రహ్మలోకమునకు గలపునరావృత్తి రహితమార్గమే దేవయాన మనఁబడును. దేవయానమన పరబ్రహ్మమును జేరుమార్గము. స్వర్గలోకమునకు బోవుమార్గమును పితృయాన మనఁబడును. పితృమార్గమనఁగా పితరులవఱకుఁ బోవుమార్గము.

కాబట్టి వేదాంతతత్వము ననుసరించి మానవుఁడే యీ స్థూలపదార్థ సమిష్టియందలి పెద్దజీవజంతువు. దానిలోనన్నిఁటికన్న నీకర్మభూమియే ముఖ్యమైనది. ఏలయన:—పరిపూర్ణత్వమునొందుటకు ఇచ్చట నేమానవునికన్నిఁటికన్న నెక్కువయు, నుపయుక్తమగునట్టియు నవకాశము లనేకములు గలవు. అని మిషులు, దేవతలు లేక వారిని మీఁరే మైనయనుఁడువీరికందరికిని మానవత్వమును ధరింపవలసియే యుండును. ఆతఁడు పరిపూర్ణత్వమును నొందవలసియున్న మానవజన్మమే యన్నిటిఁకన్న నెక్కుడు ముఖ్యస్థానమును, విచిత్రమైన ప్రదేశమును మఱియు నపూర్వసమయమునై యున్నది.

మనమిప్పుడు తత్వముయొక్క రెండవ విధమునకు వత్తము. నేనిప్పటివఱకు నిరూపించిన యాత్మ కాంశముల నెల్లను బౌద్ధులు నిరాకరించి వారిట్లు చెప్పుదురు. "ఒకపదార్థ మును ఆధారముగ (Substratum) అనఁగా శరీరము, మనస్సు

నకు, వెనుక ఆధారము (Background) కల్పించుటవలన నేమిప్రయోజనము. మనసంకల్పములమూర్పనియేల విశ్వసింపం గూడదు? శరీరము, మనస్సనెడు అవయవములను విడిచి యాత్మ యనెడు మూండవ పదార్థము. నొప్పుకొను టేలయావశ్యకము? ఇవిమంచి బలమైన హేతువులు, ఈయాక్షేపణము మిగుల సయుక్తికము. బాహ్య పరిశోధనమున కవకాశమున్నంతవరకు ఈయింద్రియ నిర్మాణ విషయమే (Organism) స్వయముగ దమప్రశ్నమున కుత్తరమగుచుండుట మనము గాంచుచున్నాము. మనలో కొంచమించుమించుగ ననేకులీప్రకాశమునిందుచూచు చుండ "మరలనొక యాధారము, లేక పునాదివలె యాత్మ యేల యావశ్యకము? అనంగా శరీరము, మనస్సును గాక తదా ధార భూతమైన (Back-ground) తృతీయపదార్థమేల యావశ్య కము? శరీరము, మనస్సనెడు రెండువస్తువులు మాత్రమే కల వనుకొనుండు. నిరంతరముమారు చుండునట్టి పదార్థ (Matter) మనునది యేశరీర మనంబడును. సంతతము ప్రవహించుచుండు నట్టి చైతన్యత (Consciousness) లేక సంకల్పము అను ప్రవాహము మనస్సనంబడును. ఏవస్తువీరెంటికి మధ్యానేకత్వ మును సృజించుచున్నది? నిశ్చయములో నీ యేకత్వమిచ్చట లేదనియే మనమందుము. ఇందుకు దృష్టాంతముగా నొక, వెలుగుచుండిన దివ్వియకోలను బుచ్చుకొని దానిని నీయెదుట త్వరితగతిని గిరగిరం ద్రిప్పుము; అప్పుడు మీరగ్నియొక్క యొక గోళాకారమును గాంతురు. ఈగోళము నిజముగాదు, కాని దివ్వి యయొక్క క్రమమైననిరంతరచలనముచే నొక వలయాకారమే

ర్పడుచున్నది. ఈలాగుననే నీజీవితమునం దేకత్వము మిథ్య. నిరంతరరూపాంతరములఁ జెందుచున్న యొక పదార్థ సముదాయమిది. ఈపదార్థసముదాయమునంతను, మీరొక మిశ్రపదార్థ మనవచ్చునేగాని వేరుగాదు; ఈలాగుననే మనస్సునుగలదు. ప్రతియొక సంకల్పము వేఱొకదానితో భేదపడియుండును. ఇవి వెనువెంట లేచుచున్న తరంగముల వంటివి. కావున వీనికి వెనుక నేకత్వము యొక్క భ్రాంతిఁ గలుగుచున్నది. ఇచ్చట యేదో యొక మూఁడవ వస్తువుండుట నావశ్యకము. "ఈమనసు, శరీరములయొక్క స్థూలప్రపంచ వికారములే నిజమైన వస్తువులు. వీనికి వెనుకనే పదార్థమును లేదు" అనుబౌద్ధ మతాభిప్రాయమును ఆధునికులైన యనేకమతములవారును, తెగలవారు నొప్పుకొనుటయు, నవలంబించుటయును మీరుకనుఁ గొనుచున్నారు. వారు తమ యీ యభిప్రాయము, నూతన మనియు తమ పరిశోధితమనియు గర్వపడుచున్నారు.

బౌద్ధమతము వారి యభిప్రాయము సాధారణముగ నిట్లుండును "ఈప్రపంచము స్వయంపరిపూర్ణము. దీనికి వెనుక నాధారముగ మఱియొక వస్తువును సంకల్పించుట నావశ్యకము. ఇంద్రియముల ద్వారా గోచరమగుచున్నదియే యీప్రపంచము. ఈప్రపంచమొక వస్తువున కాధేయమనియు, వేఱొక పదార్థము దీని కాధారమనియు తలంచుట వ్యర్థము. ప్రతివస్తువయు గుణసమూహము. అయిన నివియన్నియు నిమిడియున్న వేఱొక కల్పితపదార్థము నొప్పుకొనుటేల యావశ్యకము? పదార్థములయొక్క యభిప్రాయము వాని పరంపరాజనిత రూపాంతర

గుణచిహ్నములచేఁ బుట్టుచుండును; కాని వాని వెనుకస్థిరముగ నుండునచల పదార్థము వలనగాదు". ఇందలి కొన్ని హేతువు లెంతబలకరముగ నున్నవియో మనము జూచుచున్నాము. అవి మానవుని యొక్క సాధారణానుభవమువలననే తేట తెల్లమగును. లక్షలో నొకఁడైనను ఇంద్రియ జ్ఞానములేకనే వస్తువను గ్రహింపఁజాలడు. సాధారణముగ సృష్టియొక్క పరిణామమును, పరిభ్రమణమును సంయోగము నొందుచున్నదని యనేకులభిప్రాయపడుచున్నారు. సమస్తపదార్థములకును వెనుకనున్న యీ యచలమహా సముద్రదర్శనమును గావించిన వారు మనలో మిగులకొలఁదిమందియే యుందురు. మావద్దనది యెప్పుడును మహాతరంగసమోపేతమై యొప్పుచుండును; ఈస్థూలపదార్థ సముదాయమనునలల యొక్క తుపాను నుదయింపఁజేయుచు పొడసూపుచుండును. ఈలాగున మనము రెండభిప్రాయములఁ గనుఁగొనుచున్నాము. శరీరము మనస్సునకు వెనుకస్థిరమై, అచలమై, ఆధారమై యొప్పు పదార్థమొకటి కలదను విషయమొకటి; ఈస్థూలపదార్థ సమితియందు యేవస్తువును స్థిరమైనదియు, నచలమైనదియు లేదనుట రెండువవిషయము. ఇదియంతయు పరిణామమే. పరిణామము నొందక నిలుచునదే వస్తువును లేదు. ఈభేదముయొక్క వివరమును మనముముందు భాగమైన అద్వైతులవాదమునం జూతుము.

ఇఁక అద్వైత వాదుల యభిప్రాయమును జూతము. వారిట్లు చెప్పుదురు. అన్నిఁటికిని వెనుక పరిణామము నొందని యొక యాధారమైన (Back Ground) పదార్థ మున్నదను

నూహయందు మాత్రము ద్వైతవాదులు సత్యమును దప్పు కున్నారు. అచలమైన పదార్థమొకటి యచ్చట నుండువఱకును మనము చలనమను అభిప్రాయమును గాని, లేక చలించు వస్తువునుగాని గ్రహింపఁజాలము. మన మొక వస్తువునకంటె తీవ్ర కంపనము చేయు మఱియొక పదార్థమును గ్రహింపఁ గలిగి నప్పుడు మాత్రమే యా మొదటి వస్తువుయొక్క సూక్ష్మచలనమును గ్రహింప గలుగుదుము. దీని కన్న నతిసూక్ష్మ చలనమును గాంచునప్పుడు ఆమొదటి సూక్ష్మమునుగూడ తీవ్రమే యగును. ఈలాగుననే మనము నొకటి తరువాత నొకటి తుదవరకుఁ బరీక్షించుచుఁ బోయిన కడపట నెప్పటికిని చలింపని పదార్థ మొకటి యవశ్యకముగ నుండునని యొప్పుకొనక తప్పదు. మనకుఁ గోచర మగుచుండిన యీ స్థూల పదార్థ సమిష్టియంతయు నెప్పుడో యొకప్పుడు శాంతము, లేక నాశనము లేక అచలముగా మారును. భిన్నములైన శక్తులన్నియు నేకమగును. అనఁగా నప్పుడేశక్తియుఁ బని చేయకుండును. సమాన భారము గలిగిన శక్తులు పరస్పరములై, అసమానములై, భిన్నములై యుండుటచేఁ గలుగు వైషమ్యము వలననే క్రమముగఁ దమ పనినిఁ జేయుచుండును. యీ స్థూలపదార్థ సముదాయ మెల్లప్పుడును మరల నా సమానత్వము లేక యేకత్వము నొందుటకైయే యతివేగముగ పరువులిడుచుండును. మన మొక (సత్యమును గాని లేక యది యేమైన గానిండు) దానిని నమ్మి నప్పుడు దీనినిఁగూడ నమ్మవలసియే వచ్చును. చలనముచేయని పదార్థము లేదని ద్వైతవాదులు సిద్ధాంతము

నేయు నప్పుడు దానిని మన మొప్పుకొంటిమి. అది మిగుల సత్యము. కాని వారియొక్క 'ప్రతి పదార్థమున కొక యడుగు భాగము గలదు. అది శరీరమును, మనస్సునుగాక ఈరెంటికి నతీతమై యుండు' నను సిద్ధాంతము మాత్రము పొరబాటు. 'స్థూలపదార్థ సమిష్టియంతయు పరిణామముయొక్క యొకరాశి లేక సమూహము' అను నంతవరకు బౌద్ధమతవాదుల యభిప్రాయము మిగుల సత్యము. ఎంతవరకు 'నేను' స్థూలపదార్థ రాశికి భిన్నమై యుండునో, వెనుక నిలిచి ముందు వస్తువును వీక్షించుచుండునో, యెంతవరకు రెండు పదార్థములుండునో అనఁగా చూచునదియుఁ, జూడఁబడునదియు నుండునో, యంత వరకునుమనకుఁ బ్రపంచ మొకమార్పనియు,నదియెల్లప్పుడు మార్పునొందుచుండు ననియుఁ గోచరమగుచుండును. కాని నిజమారయ ఈ స్థూలపదార్థ రాశియందే, మార్పు నొందుటయు, మార్పు నొందకుండుటయు నను రెండు విషయములు నున్నవి. ఆత్మ, మనస్సు, మఱియు శరీరములను మూఁడును భిన్న పదార్థములనుట సరికాదు. కాఁబట్టి యింద్రియముల ద్వారా గోచరమగుచున్న యీపదార్థత్రయ నిర్మితమైన ప్రపంచము సైతము నొకటియే. శరీరము, మనస్సునకు గోచరమగుచుండు వస్తువును ఈరెంటికి నతీతమై వ్యక్తమగు పదార్థమును నొకటియే; కాని ఇవి మాత్ర మన్ని పదార్థములును గాఁజాలవు. శరీరమును జూచు మనుష్యుఁడు మనస్సును జూడఁజాలక పోవును. మనస్సును గాంచు మానవుని కాత్మయను పదార్థ మగోచరమగును. ఆత్మయను పదార్థమును గ్రహించు పురుషుని దృష్టి

నుండి శరీరము, మనస్సనెడు రెండువస్తువులు నశించును. చల నముఁ జూచు నాఁతడు సంపూర్ణమైన నిశ్చలత్వమునుజూడఁ జాలడు. నిశ్చలత్వమును జూచు వానియందు చలనము నశించును. ఒకానొక త్రాటిని పామని భావించునప్పుడు ఆభావము గలిగిన వానికి త్రాడను నభిప్రాయము మరుగుపడి పోవును, పిమ్మట నాతఁడు భ్రాంతినుండి విముక్తినొంది దానిని రజ్జువుగా గ్రహించు నప్పుడు సర్పమను నభిప్రాయము నాశము నొందును.

స్థూలపదార్థ సమిష్టినంతయు నొకేవస్తు వావరించి యుండును. అదియే నానారూపములవ్యక్తమగుచున్నది. ఈతానే, ఈయాత్మయే లేక ఈసత్త్వమేఁ (Sbestance) స్థూల పథార్థ సమితియందంతయునిండి యున్నది. ఈ ఆత్మను, లేక ఈ ద్రవ్యము (Substance) ను అద్వైతవాదుల పరిభాషయందు బ్రహ్మమందురు. అదియే నామరూపములచేత విభక్తమగుచుండుటంబట్టి భిన్నరూపముల వ్యక్తమగుచుండును. సముద్రముంజూడుడు నిజముగా నందలి యేతరంగమును దానిని విడిచి యుండదు. కాని యందు ప్రత్యక్షభేదమును జూపున దేది? అదియే నామరూపము. అనఁగా తరంగము యొక్కరూపము. ఏనామమాత్రముచే మనము దానినితరంగమనుచున్నామో ఆవస్తువే దానిని సముద్రమునుండి విభజించుచున్నది. ఆనామరూపము నశించిన తోడనే మరలసముద్ర మెప్పటివలెనే నిలచియుండును. సముద్రమునకును తరంగమునకును మధ్యఁగల ముఖ్యభేదము నెవరైన జూపఁజాలుదురా? ఈలాగుననే ఈప్రపంచమంతయు నొక్కటే యస్తిత్వమునుగలిగియున్నను నామ, రూపము లీ

భిన్నభేదోత్పత్తిని గలిగించుచున్నవి. సూర్యుఁడు లక్ష నీటిబిందువులపై ప్రసరించియు, ప్రతిబొట్టునందును సంపూర్ణమైన యా సూర్యబింబము గోచరమగుచుండు లాగుననే యీ ఆత్మ, ఈ జీవుఁడుఁ ఈ ప్రాపంచిక యునికి, నామ, రూపముఁ నెడు అనేక బిందువులపై ప్రతిఫలించి యనేక రూపముల వ్యక్తమగుచుండును. అయిన నిజమారయ నిదియంతయు నొకటియే. అందు "నేను"ను లేదు; "నీవు"ను లేదు; అంతయు నేకమే. అంతయు 'నేనే' లేక యంతయు 'నీవయే' కాని ద్వైఅనఁగా రెండు అనునవి మాత్రము లేవు ఆ యభిప్రాయము తప్ప. మనము సాధారణముగాఁ జూచి గ్రహించు స్థూల ప్రపంచమంతయు తదజ్ఞానత లేక మాయయొక్క పర్యవసానము. పరిశోధించి చూచినకొలఁదిని మాన వునికి ద్వైతము కల్లయనియు, నద్వైతమే నిజమనియు భోధపడుచుండుటయేగాక నీ బ్రహ్మాండ మంతయు 'నేనే' యనియు ను నిరంతర పరిణామ రాసియగు నీబ్రహ్మాండముయొక్క ప్రస్తుత స్థితియును, మఱియు నెల్లపరిణామములకును, గుణములకును విలక్షణమై వెలయు నిరంతర పవిత్రవంత పథార్థమునుఁ గూడ 'నేనే' యనియు తేటతెల్లమగుచుండును.

కావున 'నేను' మాత్రమే అనఁగా యొక్క ఆత్మ మాత్రమే యుండును. అదియే నిరంతర పవిత్రాత్మకమును, అఖండ పరిపూర్ణమునునై యుండును. అదియొకప్పుడు మార్పు నొందినదియు, మఱియుఁ బొందఁదగినదియుఁ గూడ కాదు. అది యెప్పుడును పరిణామము నొందకుండును. ఈ ప్రాపంచిక భిన్న పరిణామములన్నియు నా యాత్మయందలి బాహ్యరూపములే.

నామరూపములే దానిపై నీకల్పనంతను రచించుచు న్నవి. రూపమే తరంగమును సముద్రమునుండి వేరుపరచుచు నది. తరంగము సమసిపోయిన దనుకొందుము. అప్పుడేరూప మునిలిచియుండును.? ఏరూపమునుండదు. అదియు నదృశ్యమ గును. తరంగముయొక్క యునికి పూర్తిగ సముద్రముయొక్క యస్తిత్వముపై నాధారపడియుండును. కానిసముద్రముయొక్క యునికి తరంగముయొక్క యునికి పైనాధారపడి యుండలేదు. తరంగము నిలచియుండువఱకును రూపము గూడ నిలచియుం డును. అల సమసిపోవుకొలఁదిని రూపమదృశ్యము నొందుచుం డును. అది నిలచియుండఁజాలదు. ఈనామరూపములు మాయ యను పథార్థము యొక్క పర్యవసానము. ఈ మాయయే వ్య ష్టినిర్మాణముఁ జేయుచు, నొండింటికి భిన్నత్వమునుఁ జూపు చున్నది. అయినను దీనియొక్క యస్తిత్వము మాయయొక్క గాని, రూపముయొక్క గాని యునికి యనుటకు నది యితఱ పథార్థము యొక్క యస్తిత్వముపై నాధారపడి యుండుటచే వీలు లేకున్నది. మఱియు తత్కాల్పితములైన యనేకభిన్న రూ పాంతరములను మనముఁ జూచుచుండుటచే దాని కస్తిత్వము లేదనుటకును నవకాశములేదు. అద్వైతమతాను సారము, ఈ మాయ, ఈఅజ్ఞానము, ఈనామరూపములే, దేశ, కాల, నిమిత్తములని చెప్పఁబడు చుండును. ఇవియే ఆయొక్క అనం తమైన పదార్థమునుండి యుత్పన్నమై, స్థూలపదార్థ సమితియొ క్క భిన్న పరిణామములను మనకుఁ జూపుచున్నవి. వేయేల ఈసృష్టియంతయు నేకపదార్థమునుండి పుట్టినది. దీనికంతయు

నాధారభూతమైన నిత్యపదార్థమొక్కటియే యని, ధృఢనిశ్చయుఁడై యుండు వఱకును మానవుఁడు సన్మార్గగతుఁడై యుండును. రెండు నిత్యపదార్థములుండునని తలఁచునంతవఱకును, దృష్టాంతముగా:—ప్రకృతి, పురుషుఁడు. నాతఁడు పెడత్రోవనే యుండును. ఈవిషయమే మనకనుదినము శారీరకా ధ్యాత్మిక మానసిక రూపముల వ్యక్తమగుచున్నది.

నేఁటియుపన్యాసముచే నేను, నీవు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, మున్నగునవెల్లను స్థూలద్రవ్య సముద్రమునందలి వివిధ బుద్బుదములయొక్క నామ రూపములని తేటపడినది. ఈ పదార్థమే పరిణామము నొందుచు ననవరతము నూతనరూపములఁ దాల్పఁ జేయుచుండును. నేఁటికిఁ గొన్ని నెలలక్రిందట సూర్యునియందుండిన శక్తియొక్క యొక పరమాణువు నేఁడు మానవునియందును, లేపొక జంతువునందును, యెల్లుండి యొక వృక్షమునందు నుండవచ్చును. అది యెల్లప్పుడు తారుమారగుచుండును. పదార్థము అనంతమైనట్టియు, అపారమైనట్టియు, నొకరాశి. అదియే నామరూపములచేత భిన్నమై తోఁచును. ఒకపరమాణువు సూర్యుఁడనియు, రెండవది చంద్రుఁడనియు, మూఁడవది నక్షత్రమనియు, నాలవది మానవుఁడనియు, అయిదవది జంతువనియు, నాఱవది వృక్షమనియు ననఁబడుచుండును. ఈలాగుననే యెల్లనామములును కల్పితములే. స్థూలపదార్థ సమిష్టియంతయు పదార్థము యొక్క నిరంతర పరిణామమునొందు రాశివంటిది. కాఁబట్టి దీనికి మూలమేమియు లేదు. స్థూలపదార్థసమితి యే రెండవ

రూపమున నొక సంకల్ప మహాసముద్రము వంటిది. ఆసముద్రమునందు మనలోని ప్రతిమానవుడును నొకబిందువు; లేక యంతర్భావమని యనిపించుకొనును. దానినే యొక ప్రత్యేక మనస్సందుము. నీవునుఁగూడ యొకమనస్సువే. నేనునుఁగూడఁ యొకమనస్సునే. ప్రతివస్తువయు నొకమనస్సే. ఎప్పుడు నేత్రము లీభ్రమనుండి పవిత్రతఁగాంచునో మనస్సు నిర్మలత నొందునో, ఆస్థూలపదార్థ సమిష్టియే సత్యాసృష్టిచేఁ జూడఁబడునో అప్పుడే ఈఅనంతమై, అపారమై, నిత్యమై, పరిణామరహితమై, పవిత్రమై, అవినాశమై వెలయు సత్పదార్థము గోచరమగును.

మంచిది, ఈలాగుననే యగునేని వెనుక నుదహరింపఁబడిన ద్వైతవాదుల త్రివిధ పరమావధులు అనఁగా మానవుఁడు మృతినొందునప్పుడు స్వర్గాదియముక లోకములకు బోవుననుటయు, దుర్మార్గుఁడుభూత, ప్రేత, పశ్వాదిజన్మములం దాల్చుననుటయు నేమగును? అద్వైతవాది యిట్లుచెప్పును. ఒకఁడు వచ్చుటయును లేదు; ఒకఁడుపోవుటయును లేదు. నీవెట్లు రాఁగలవు? నీవనంతముగదా? నీపోవుటకు స్థలమేది? ఒకపాఠశాలయందు కొందఱు పసిబాలురు పరీక్షింపఁబడుచుండిరి. పృచ్ఛకుఁడు తనయజ్ఞానముచే నాబాలురపై నానావిధములగు కఠిన ప్రశ్నములు వేయఁగడంగెను. అందొకటీ ప్రశ్నయు నుండెను. భూమి ఒఱగి యేలపడకుండును? ఈప్రశ్నవలన భూమ్యాకర్షణ విషయముగాని లేక మఱియేదియో యొకవిద్యావిషయికి సూక్ష్మమునుగాని బాలుర హృదయ సీమలందు నాటఁజేయవలయునని పృచ్ఛకుని యభిప్రాయము. ఆబాలుర యందనేకు

లా ప్రశ్నాభిప్రాయమునే గ్రహింపలేకుండిరి. తుదకందఱన్ని విధముల నుత్తరవుల నొసంగిరి. అందొక చురుకుఁదనము గలిగిన బాలుఁడు మాత్రము రెండవప్రశ్నా రూపమున దానికిట్లు త్తరువొసంగెను. అదివంగి యెక్కడపడి పోవును? ఈప్రశ్నము ముందా పృచ్ఛకుని ప్రశ్న నిష్ఫలమైయుండెను. ప్రపంచమునందెవరును హెచ్చుతగ్గులుగ నుండరు. ఈయభిప్రాయమేదో యొక యధ్యాసమాత్రముననే గలుగుచుండును. ఈలాగుననె యాత్మికవిషయమునగూడ ననుకొనుఁడు. జనన మరణప్రశ్న మీకారణమున బొత్తిగ నిరర్థకము. పోవువాఁడెవఁడు? వచ్చువాఁడెవఁడు? నీవెచ్చట లేకున్నావు? నీవీసమయమున లేనిస్వర్గ మెచ్చటనున్నది. మానవుని యాత్మ సర్వవ్యాపకము. దీని కెచ్చటికి పోవలసి యుండును? మరెచ్చటికి పోగూడకుండును? అది సర్వాంతర్యామి; అన్నిప్రదేశములయందునుండును. కాఁబట్టి జీవితము, మరణము, స్వర్గము, సౌఖ్యము, నరకము మొదలగునవన్నియు పిల్లలస్వప్నములు. అఖండపరిపూర్ణుని ముందర నివియన్నియు తక్షణమే యదృశ్యమునొందును. బ్రహ్మలోకము వఱకుంగల వైచిత్ర్యములన్నియు పరపూర్ణులగు జ్ఞానులకగుపడియే యదృశ్యమునొందును. పరిమితులగు అజ్ఞానులకొఱకే యవియన్నియు నిలచి యుండును,

అయిన నీప్రపంచమంతయు స్వర్గగమనము. జనన మరణములు మొదలుగాగల వన్నిఁటిని యేలవిశ్వసింపవలయును? నేనొక గ్రంథమును చదువుచున్నా ననుకొనుఁడు. ఒకపుట తరువాత వేరొకపుట చదువఁబడి త్రిప్పివేయఁబడుచున్నది. త్రిప్పు

వాఁడెవఁడు? వచ్చున దేది? పోవున దేది? పుస్తకముకాని నేను గాదు. ఈప్రకృతి యంతయు నాత్మయెదుట నొకపుస్తకము వలెనున్నది. ఒకపాఠము తరువాత వేరొకపాఠము చదువఁ బడుచుండును. త్రిప్పివేయఁబడుచుండును. చదివి త్రిప్పివేయఁ బడిన పిదప రాఁబడు ప్రతినవీన వ్యాసము నందును ప్రతిసారి యొక నూతన చమత్కారము గానఁబడుచుండును; కాని యాత్మమాత్ర మెల్లప్పుడు నొకటియేయై శాశ్వతముగనుండును. ఎల్లప్పుడు దశాంతరముం జెందునదీ ప్రకృతియే. కాని మానవునియందలి యాత్మమాత్రము రూపాంతరము నొందదు. జననమరణములు ప్రకృతియందుఁగాని యాత్మయందు లేవు. అయినను జ్ఞాన శూన్యులు తొట్రుపడుచుందురు. దృష్టాంతముగా మనము, భ్రాంతిచే సూర్యుఁడు తిరుగుచున్నాఁడు, కాని భూమి తిరుగుటలేదని తలంచుచున్నాము. తాదృశమున నే చచ్చునది మనముగాని ప్రకృతిగాదని మనమభిప్రాయ పడుచున్నాము. కావున నిదియంతయు భ్రమ లేక భ్రాంతియే. మన మొక రైలుబండిలో ప్రయాణము సేయునప్పుడు పరుగిడునది భూమిగాని రైలుబండిగాదను భ్రాంతిఁగలుగులాగుననె జనన మరణముల విషయమున గూడ భ్రమగలుగుచునే యుండును. మానవుని మనస్సొక ప్రత్యేకమయిన స్థితిని పొందు నప్పుడాత డీప్రపంచము నంతను భూమి, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములుగఁ జూచును. మఱియు నీస్థితియందున్న వారందరుఁగూడ నీవస్తువులనే గాంచుచుందురు. నాకును నీకును మధ్య జీవితము యొక్క భిన్నములైన రూపములుగలవు. లక్షలకొలఁది జీవ

రాసులుండవచ్చును. కాని అవి మనలఁగాని, మనము వానినిఁ గాని చూచుట లేదు. మనస్సుయొక్క సమానమైన స్థితియందున్నవానిని మాత్రమే మనము చూడఁగలుగుచున్నాము. వాయిద్యములన్నియు స్వరమునందేకమై మ్రోయునప్పుడొక్క రాగము వినబడుచుండియు, నించుక వానిస్వరముల తారుమారు చేసిన మాత్రముననే యొకటొకశబ్దమును మఱియొకటి మఱియొకశబ్దమును శబ్దించుచుండుటయే దీనికిఁ దార్కాణము.

ఈలాగుననే మానవుఁడను జంత్రముయొక్క సమాన స్వరముల క్రిందు మీఁదు చేయుదుమేని పిమ్మట నొకమానవుఁడైనను కంటఁబడకుండును. మానవ ప్రపంచమంతయు మాటుపడి పోవుచుండును. ఆస్థానమున మన ముంగట నూతన రంగము జూపట్టుచుండును. అదియే దేవతలకు దేవలోకమును, దుర్మార్గులకు భూత, ప్రేత, పిశాచ లోకమునై యుండనోపు. ఇవి యన్నియు నొకే ప్రపంచముయొక్క దశాంతరములు. ఈస్థూల పదార్థ సముదాయమే మానవ దృష్టిని జూచునప్పుడు భూమి, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు మున్నగు మఱెన్నెన్నియో వస్తుసముదాయరూపమున గోచరమగుచుండును. అదియే పాపదృష్టినిఁ గాంచునప్పుడొక శిక్షాప్రదేశముగ గనఁబడుచుండును. స్వర్గమునకుఁ బోఁగోరువారికి స్వర్గమే కానంబడును. ఈశ్వరుఁడు సింహాసనాసీనుండై వేరొలగముఁ దీర్చియుండు ననియు, మన మాతని మ్రోలకుఁ జనునప్పుడచ్చట నిలిచియుండి మన యావజ్జీవ మాతని స్తుతి, స్తోత్రములు సలుపుచుందు మనియు భావించువారు మృతి

నొందు నప్పుడు వారి మనస్సు నందుండు భావములనే వారు జూతురు. ఈ ప్రపంచమే యొక విశాలమైన స్వర్గరూపమున పరిణామము నొందును. దాని చుట్టును సకల విధములైన పక్షులు, జీవజంతువులు సంచరింప వచ్చును. దేవతలు సింహాసనా సీనులై యుండనోపు. ఈస్వర్గములుగూడ మానవ నిర్మితములే. అద్వైతసిద్ధాంతానుసారము ద్వైతవాదు లొప్పుకొను నదంతయు బాగుగనే యుండును. కాని యవి యన్నియు వారిచే స్థాపింపబడిన పుక్కిటి పురాణములు, కథలును. ఈ లోకములు, పిశాచములు, దేవతలు, అవతారములు, పునర్జన్మములు మొదలైన వన్నియు కేవల కల్పనా కథలు. మానవుని జీవితము నీలాగుననే యున్నది. ఇవి యన్నియు కథలు. కల్పితములనుట మాత్రమే కాదు. కొంతవఱకివియు బాగుగనే యున్నవి. లోకు లెల్లప్పుడు నొక పెద్దలోపమును జేయుచుందురు. వారు దానిని చక్కఁగా గ్రహింపఁ జాలరు. మీఁదు మిక్కిలి యితరములైన విషయము లన్నిఁటిని కథలు, కల్పితము లందురు గాని, తమ స్థితి విషయమైన వాక్యముల నొప్పుకొనుట కిష్ట పడకుందురు. ఈ వ్యక్త మగు నదంతయు కేవలము కల్పితమే. మనము శరీరము లనుట సర్వాబద్ధము. అవి యిదివఱకైనవియును, ముందుకాఁ బోవునవియునుగూడ కావు. మనము సాధారణ మానవులనుటయు నిట్టిదే. ఈస్థూలపదార్థ సమిష్టికి మనమేసృష్టికర్త నున్నాము. ఈశ్వరారాధనము సేయుటలో, నెల్లప్పుడు మనము మనయందు దాగియున్న ఆత్మనే పూజించుచున్నాము. నీవెల్లప్పుడు, నీమన

స్సునందు "నేనొక పాపాత్ముఁడను, దుర్మార్గుఁడను జన్మించి తి"నని యనుకొనుచుందువు. అదియొక మిక్కిలిపొరపాటు. తానుపాపాత్ముఁడైనవాఁడే యితరులను పాపాత్ములనుగ జూచుచు, భావించును. ఒకదొంగవచ్చి యొకబాలుని యెదుటనున్న మొహరీలనుదొంగిలించుకొని పోవుచున్నాఁడనుకొనుము. ఆబాలుని యెదుట నివియన్నియు సమానములే. ఆతనియాంతస్సున దొంగ లేదు కావున బయలను కూడలేదు దుష్కర్మునకును, పాపాత్మునకును బయలను సహితము చెడుగేయుండును. పుణ్యాత్మునకట్లుకాదు. దుష్కర్ముఁడీ ప్రపంచమును, నరకమువలెజూచును; సద్ధర్ముఁడిందే స్వర్గమును గనును. అఖండపరిపూర్ణుఁడు దీనినే ఈశ్వరునిగ గ్రహించును. తనదృష్టినుండి భ్రమయను జవనిక తొలఁగిపోవునప్పుడు పవిత్రుఁడును, పుణ్యాత్ముఁడునగు మానవుఁడు తానదివఱకుఁ జూచుచుండు రంగమునే దశాంతరరూపమునఁ జూచుచుండును. మఱియు శతాబ్దములనుండి మానవునికిబ్బందిని గలిగించు దుస్స్వప్నములన్నియు నశించును. తనను తానే మనుష్యుఁడు పిశాచము, దేవతయనియు తానేస్వర్గము, నరకము, భూమి, యాకాశముల పైనుండువాఁడనియు భావించుమానవునికి తానే నిత్యమనియు, కాలము తనయం దిమిడి యుండునుగాని తాను కాలమునకు లోఁబడి యుండననియు ఎల్లస్వర్గములును తనయందడఁగియుండును గాని తానేస్వర్గమునందుండననియు మానవునిచే ననారతము పూజింపఁబడు నెల్ల దేవతలును నాయందుండునుగాని నేనే దేవతకును లోఁబడియుండననియు మఱియునేనే దేవతలు, రాక్షసులు, మానవులు, తిర్య

క్కులు, జడములు ఇత్యాదులకెల్లను నిర్మాణకుఁ డననియు, గ్రాహ్యమైపోవును. అప్పుడు తానే ఈస్వర్గముల కన్నిఁటి కంటె నున్నతుఁడనియు, కాలాతీతుఁడనియు, ఆకాశమున కంటె నెక్కుడు సర్వవ్యాపకుఁడనియు, మానవత్వముయొక్క నిశ్చయాంశమాతనికి విస్పష్టముగ కరతలామలకమగును. ఈలాగున మానవుఁడు స్వాతంత్ర్యుఁడును, నిర్భయుఁడు నగును. ఇప్పుడే అన్నిభ్రమలును, భ్రాంతులును తొలఁగిపోవును. అన్ని కష్టములు నదృశ్యములగును. ఎల్లభయములు నెల్లప్పటికిని తొలఁగిపోవును. జననభావము నశించును. తోడనే మరణ దుఃఖముగూడ ననామకమగును. దాని వెంటనే సౌఖ్యమును దూరమగును. భూమినాశనమగును. తోడనే స్వర్గము భ్రష్టమగును. శరీరము నష్టమగును. దాని వెంటనే మనస్స గోచరమగును. వేయేల ప్రపంచమంతయు నాతని దృష్టినుండి పతితమై నిశ్చలమగును. శక్తులయొక్క ఈ యన్వేషణము, చలనము, నిరంతరాకర్షణ మెల్లప్పటికై నిలిచిపోవును. శక్తి, పదార్థము, ప్రకృతియొక్క పరస్పరసంఘర్షణముచే ప్రకృతిస్వయముగానె స్వర్గము, భూమి, వృక్షములు, జంతువులు, మానవులు, దేవతల రూపమున వ్యక్తమగుచు, దశాంతరముల నొందుచు, అపారమును, అనంతమును, అఖండమును, పరిణామరహితమును నగు యస్తిత్వముగ నేర్పడును. జ్ఞాని ఈయస్తిత్వమును, తాను, నొకటియేయని తెలిసికొనుచున్నాఁడు. గగనభాగమున నానావర్ణములుగల మేఘశకలము లుత్పన్నములై కొండొకనేపటికి మరల నదృశ్యములగు లాగున భూమి, ఆకాశము, చం

ప్రేమము, ద్వేషత, సౌఖ్యము, దుఃఖములనెడు యెల్లభావములును స్వప్నములును ఆత్మయనెడు ఆకాశము పైకి వచ్చుచుండును. కాని యవి యున్నియు నీలమును, అనంతమును, పరిణామ రహితమునైన ఆకాశమును మాత్రమునే విడిచి యదృశ్యములై పోవుచుండును. ఆకాశమెప్పుడును మార్పునొందునది కాదు. మనము పొరపాటుచే నాకాశము దశాంతరము నొందునని భావింతుము. ఈలాగుననే మనము అపవిత్రులమనియు, పరిమితులమనియు, భిన్నులమనియు భావించుటయుఁగూడ మన యవజ్ఞతయె. సత్యపురుషుఁడు మాత్రమా యేకమైన మూల పదార్థమె.

ఇప్పుడిచ్చట రెండు ప్రశ్నలుగలుగుచున్నవి. ఈ యంశమును అనుభవమునకుఁ దెచ్చుకొనుటసంభవమగునా? ఈ విషయమెంతవఱకు సిద్ధాంతికముగను, తాత్వికముగను నుండునో పరిశోధించుట సంభవించునా? సంభవించును. భ్రమను దమతావునుండి యెల్లప్పటికిని దూరీకరింపఁజేసిన వారిప్పుడీ ప్రపంచమునందున్నారు. వారీయంశమును పరిశోధించి యనుభవమునకుఁ దెచ్చుకొనిన తక్షణమే మృతులగుచున్నారా? మనముతలఁచు నంతటి త్వరితగతిని మృతులుగారు. రెండుచక్రములు ఒకయిరుసుతోఁ గలుపఁబడి సమానముగ నడుచును, గొడ్డలిచే నాయిరుసును దునుమాడి యందు నొక చక్రమును వేరుచేసి యూడ్చుకొనినను యా రెండవచక్రము మొదటివేగము వలన కొంతదూరము వెళ్లి క్రిందపడును. ఈలాగుననే పవిత్రమును, పరిపూర్ణమునైన యీయునికి, అనఁగా యీ ఆత్మైక

చక్రము. ఈశరీరముయొక్కయు,మనస్సు యొక్కయు బాహ్యా భ్రమ రెండవ చక్రము. ఈరెండును కర్మయనెడు యిరుసు వలన సంధింపఁబడియున్నవి. జ్ఞానమను గొడ్డలి యీరెంటికిని గల సంబంధమును నఱికివేయును. అంతట ఆత్మయను చక్రము ఆగిపోయి. నాకుగమనాగమనములు. జన్మ, మృత్యువులు గల వనియు నేనే యీ ప్రకృతి ననియు నాయందే కోఁకలును గల వనియు నభిప్రాయమును వీడి, నేనే పరిపూర్ణమును, పవిత్రము నని తెలిసికొనును. కాని శరీరము, మనస్సనెడు, రెండవచక్ర ముపై వెనుకటి కర్మఫలము కొంతమిగిలి యుండును. కావున అది తీరువఱకును దీనికిఁ గొంతకాలము జీవించి యుండవలసి వచ్చును. ఆకర్మఫలము తీరినతోడనే శరీరముః మనస్సును నశించును. అప్పుడు ఆత్మ స్వతంత్రముఁనొందును. పిమ్మట దానికి స్వర్గమునకుఁ బోవుటయు, తిరిగి వచ్చుటయు, బ్రహ్మలోకమునకుఁ గాని యంతకన్న మఱియే యితర యూర్ధ్వలోకమునకుఁ గాని పోవుటయు, తిరిగి వచ్చుటయు లేకుండును. దాని కెచ్చటికి వచ్చుట, మరెచ్చటికి బోవుట కలుగును? ఎవనికి, తన యీజీవితమునందే యిట్టి స్థితి గలు గునో, ఎవనికొకనిముసమైనను, సాధారణమైన యీప్రాపంచిక దృష్టిమారి సత్యత్వమువ్యక్తమగునో, యాతఁడు జీవన్ముక్తుఁడని పిలువఁబడును. వేదాంతముయొక్క గమ్యస్థానము ఈ జీవ న్ముక్తి నొందుటయే.

ఒకానొక సమయమున నేను పశ్చిమ హిందూస్థాన మున, హిందూ మహాసముద్ర తీరమునందు, యెడారి మధ్య

మున ప్రయాణము చేయుచుంటిని. నేను చాల రోజులవఱ
కెడారియందు కాలి ప్రయాణము చేసితిని. అందనుదినము
నాకు నలు దిక్కుల నల్లనల్లన చలించు వృక్షములచే నావ
రించి తచ్ఛాయాపతనముచే నీటియందు గలుగు విచిత్ర వర్ణ
ముల వెదజల్లు సుందర కాసారములం జూచు నప్పుడెల్లను
యిట్టి సౌదర్య సమన్వితంబైన దేశమును లోకు లెడారియనుట
యెట్లాయని నాకాశ్చర్యము గలుగుచుండెను. కొంచె మించు
మించుగ నొక మాసమువఱకట్లే నేనందు విచిత్రములైన
సరోవరములును. వృక్షములును, పూఁబొదరిండ్లను జూచుచు
ప్రయాణము సేయుచుంటిని. ఒకానొకనాఁడు నాకు దప్పికై
నందున నేను కొంచెము నీరుఁ ద్రావనెంచితిని. కావున నే నా
నిర్మలమును, సౌఁదర్యము నైన సరస్సునకుం బోయితిని. నేను
సమీపమున, కరుగు కొలఁదిని యవియదృశ్యములగుచుండెను.
వెంటనే నాకవినాజీవితమంతయు చదువుచుండిన యెండమావు
(మృగతృష్ణ) లని నామనస్సున జ్ఞప్తికి వచ్చెను. తోడనే నే నీ
మాసమురోజుల నుండి యనుదినముఁ జూచునవన్నియు నెండ
మావులే కాని నేను వానిని గ్రహింప లేకుంటిననికూడ భావిం
చితిని. రెండవరో జుదయమున మరలనేను నాప్రయా
ణము నారంభించునప్పుడు మరల నట్టి కాసారములే
కనులఁ గట్టినట్టు గానుపించు చుండెను. గాని తోడనే
నా కవి యెండమావులు గాని నిజమైన కాసారములు
గావను భావముగూడ నుదయించెను. కాఁబట్టి మన యీ
ప్రపంచపు స్థితియు నిట్టిదియే. మన మందఱమును ప్రపంచ

మను మృగతృష్ణను జూచుచునే రోజులు, నెలలు, వర్షములు ఇందు ప్రమాణము సేయుచు మృగతృష్ణయని గ్రహింపలేకున్నాము. ఒకప్పుడిది మనకుఁ గ్రాహ్యమగును. కాని శరీరము. తనపూర్వజన్మకృతఫల మనుభవించుట కుండవలసి యుండును, కావున నీమృగతృష్ణ మరల గోచర మగుచునే యుండును. మనము కర్మబద్ధులమై యుండువఱకు మన కీప్రపంచక ముండును. పురుషుఁడు, స్త్రీ, పశువులు, సస్యములు, మన యనురాగములు, ధర్మములు అన్నియు మన వెంట నంటియే వచ్చును. కాని యంతశక్తిఁ గలిగియుండవు. నవీనజ్ఞానబలముచే కర్మయొక్క శక్తి నశించును. మఱియు తత్ఫలము పోవుచుండును. స్థితి బొత్తిగ మారును. దీనితోఁగూడ మనకు సత్యమునకును, అసత్యమునకునుగల తారతమ్యము తెలియఁబడెనను భావ ముదయించును. అప్పు డీప్రపంచము పూర్వప్రపంచము వలె నుండకుండును. అయిన నిందును కొంచెము సంశయము కలదు. తాము పాపపుణ్యముల కతీతులై యుందురు. కాఁబట్టి తమ రే నీతి చట్టములకు నిబద్ధులుగారు. తమయిష్టమే చట్టము. తమరు గోరు నదెల్లను జేయఁగలుగుదు రను విషయముల నొప్పుకొనిచెప్పుచుండు వారిని మన మన్ని దేశము లందును జూచుచున్నాము. మేము నిబద్ధులము గాము. మేమే స్వయంబ్రహ్మము. మేము తలఁచు నదెల్లను జేయవచ్చును. అను బుద్ధిహీను లనేకుల, మీరీదేశమునందుఁ జూతురు. ఈ భావమయుక్తము. ఆత్మమానసిక, శారీరక, నైతిక చట్టముల కతీతమై యుండు ననుట నిశ్చయమేయైనను, నీభావ మయుక్తమే.

స్మృతి (Law) నిబద్ధమై యుండునది నిర్బంధము. స్మృత్యాతీతమై వెలయునది స్వాతంత్ర్యము. మఱియు స్వేచ్ఛయే యాత్మయొక్క నిజస్వభావమై యున్నది. అదియే దానియొక్క జన్మహక్కు. ఆత్మయొక్క స్వేచ్ఛయే మానవుని బాహ్య స్వేచ్ఛారూపమున ప్రకృతి యను జవనిక ద్వారమున ప్రకాశించుచున్నది. నీ జీవితమునందలి ప్రతి నిమేషమును, నీవు స్వతంత్రుండవని భావింపుము. మనము స్వతంత్రులమని భావింపనిది, మన మొక నిమిషమైనను, జీవింపను గాని, మాటలాడను గాని, తుదకు శ్వాసఁగొనను గాని చాలమనుట నిజమే; కాని వెంటనే మన మొక యంత్రమును బోలి యున్నామనియు, స్వతంత్రులము గామనియు నొకభావ ముదయించు చున్నది. ఇచ్ఛ యేమాట సత్యము? స్వతంత్రభావ మొక భ్రమయా? ఒక పక్షమువారు స్వతంత్రభావ మొక భ్రమయని తలంచుచున్నారు. రెండవ పక్షమువారు బంధనమను తలంపే భ్రమయందురు. ఇది యెట్లు సంభవించును? నిశ్చయముగా మనుష్యుఁడు స్వతంత్రుండు. సత్య మానవుండు స్వతంత్రుండే కాని మానవాకృతిమగు నీప్రపంచమునందు వచ్చునప్పుడు అనేక నామరూప సహితుండగు నప్పు డాతఁడు పారతంత్ర్యుఁ డగుచున్నాఁడు. స్వతంత్రేచ్ఛ యొక కల్పనము. ఇచ్ఛయెన్నఁడును స్వతంత్రము కానేరదు. ఇదెట్లగును? సత్యపురుషుఁడు పరతంత్రము (బంధము) నకు లోఁబడినప్పుడుమాత్రమే ఇచ్ఛ గాని యంతకుం బూర్వము ఇచ్ఛయొక్క యునికి యుండదు. మానవేచ్ఛ బంధ సహితమైనది; కాని దానికిమూలమైన పదార్థము

మాత్రము శాశ్వత స్వతంత్రము గలిగినది. కావునమనమిప్పుడు మానవ జీవితమును, దేవతా జీవితమును, భూమియందుగాని, స్వర్గమునందుగాని వాసముచేయువారి జీవితమును నిర్బంధమే యని యందుము. ఈ స్థితియందుఁగూడ మనప్రకృతి సిద్ధమైన స్వాతంత్ర్య చిహ్నముమాత్రము నిలిచియే యుండును. జ్ఞానా, జానముచే మనము దానిఁ జేరవలయునని ప్రయత్నపడుచున్నాము. తనసంపూర్ణ స్వాతంత్ర్యమునుబొందిన మానవుఁడొక చట్టముచే నేల నిర్బంధింపఁ బడగలుగును? ఈ ప్రపంచమే యాతనిది. కాఁబట్టి యీ ప్రపంచముయొక్క సిద్ధాంతము లేవియు నాతని నిర్బంధింపఁజాలవు,

ఆతఁడేస్థూలపదార్థ సమిష్టియంతయుననిగాని లేక స్థూల పదార్థ సమిష్టియంతయు నాతఁడేయనిగాని లేక యాతనిదృష్టి యందీస్థూల పదార్థ సమితి లేదనిగాని చెప్పుము. అప్పుడుఆతనికి దేశభేదముగాని, లింగభేదముగాని యెట్లుకలుగును? ఆతఁడు నేను పురుషుఁడననిగాని, స్త్రీననిగాని, బాలుఁడననిగాని, యేలచెప్ప గలుగును? ఈ మాటలన్నియు నసత్యములుగావా? ఇవియన్నియు నబద్ధములని యాతనికిఁ దెలియును. అతఁడేలయివి పురుషస్వత్వములనియు, నివి స్త్రీస్వత్వములనియుఁ జెప్పఁజాలును? ఒకమనుష్యునకు హక్కులును లేవు. ఒకశరీరము వేరుపడి జీవింపనునేరదు. పురుషుఁడును లేఁడు, స్త్రీయును లేదు. ఆత్మకు లింగభేదము లేదు. అది శాశ్వతముగా స్వచ్ఛమైనది; స్త్రీలింగమునుగాని, పుం లింగమునుగానికాదు. అది నిరంతమును పవిత్రమైనదే. నేనీదేశముయొక్కగాని, లేక యితరదేశముయొక్క

గాని పురుషుఁడననిగాని స్త్రీననిగాని చెప్పుటయుఁగూడ నబద్ధమే నేను శరీరరూపమున దానిని ధరించియున్నాను. కాఁబట్టి ప్రపంచమంతయు నా దేశమే; ప్రపంచమంతయు నాయదియే. అయినను యీసమస్యల నొప్పుకొనుటకు సిద్ధముగ నుండియు మనచే నపవిత్రములనఁబడు పనులనుచేయుచున్నవారి నీ ప్రపంచమునందు మనమనేకులను జూచుచున్నాము. తోడనేవారిని మీరేల యీ యసత్కార్యములను చేయుచున్నారని మనమడుగునప్పుడు వారిట్లు మనకు సమాధానము చెప్పుదురు. మీ తలంపొక భ్రమయే; కాని మేముచేయునదిమాత్రము దుష్టమైనది కాదు. మేము దానిని తీర్మానించుటకు వలసినంత పరిశీలించితిమి. ఆపరిశీలనమిది.

మంచిచెడ్డల ననుసరించియే యాత్మవ్యక్తమగు చుండినను, సత్యమానవునకు, లేక ఆత్మకు చెడుగు మిగుల బాహ్యావరణముగను, మంచి సామీప్యావరణముగను నుండును. మానవుఁడు చెడుగనెడు బాహ్యావరణమును గడచువఱకును, మంచి యనెడు యంతరావరణమును జేరఁజాలడు. అతఁడీ యావరణ ద్వయమును గడచిన గాని, ఆత్మను జేరంజాలడు. ఆత్మను సమీపించిన మానవున కేసంబంధము మిగిలియుండును? ఇంచుక సంచితకర్మ యనఁగా జన్మాంతరముయొక్క కొంతఫలము మిగిలియుండును. అది మంచితో సంబంధమును గలిగియుండును. దుష్కర్మఫలము పూర్తిగ నశించువఱకును, జన్మాంతర దోషములు పూర్తిగ దహించువఱకును, ఈశ్వర దర్శనముగాని, తత్పరిశోధనముగాని,

లేక తదనుభవముగాని మానవున కసంభవము. కావున ఆశ్మను జేరినవానికిని, ఈశ్వరత్వమును గ్రహించిన వానికిని వాని జన్మాంతరము నందలి సత్ఫలముల యొక్కయు, సత్కర్మలయొక్కయు శేషము వెంటనంటి యుండును. ఆతఁడు జీవించియుండినను, ఎడతెగక కృషిసల్పుచుండినను సత్కార్యముల నే చేయుచుండును. ఆతనినోరు సర్వజనోపయోగమునకే మాట్లాడుచుండును. ఆతని హస్తములు పుణ్యకార్యములనే చేయుచుండును. ఆతని మస్తిష్క మెప్పుడును సద్భావములనే తలపోయుచుండును. ఆతఁడెచ్చటికిఁ బోయినను ఆతనియునికియే పవిత్రవంతముగను, పావనముగను పూజనీయముగ నుండును; ఆతఁడు స్వయముగా పావనమూర్తియై వెలయుచుండును. అట్టి పురుషుఁడెచ్చటి కేగినను తనదర్శన మాత్రముననే యెట్టి పాతి పాపునైనను జ్ఞానిగఁజేయును. ఆతఁడు నోటవచింపక పోయినను ఆతని రూపమే మానవునకు పుణ్యప్రదమగును. అట్టివారు చెడుకార్యములం జేయుదురా? దుష్కర్మాచరణ మొనరింతురా? నోట వచించుటకును, ఈశ్వరానుభవమునకును భూమ్యాకాశాంతరము గలదని మీరుజ్ఞప్తియుంచుకొనుఁడు! చెప్పుటకు ప్రతి జ్ఞానశూన్యుఁడును చెప్పఁగలుగును. చిలుకలును పలుకును. పలుకులువేఱు; ఈశ్వరానుభవము వేఱు. తత్వములు, సిద్ధాంతములు, హేతువులు, వాదోపవాదములు, గ్రంథములు, దేవళములు, జాతిమత విభేదములు ఈంగాటి మఱియెన్నెన్నియో విషయములన్నియు, తమతమ స్థానముల మంచివియే. కాని ఈశ్వరానుభవ

ముకలుగు నప్పుడు మాత్రమవియు నదృశ్యములగును. ఉదాహరణార్థ మొక్కవిషయముఁ దిలకింపుడు. దేశపటములు పంచివియేమైనను నీవు స్వయముగా నాదేశమును గాంచిన పిమ్మట పటమునందుఁ జూచునప్పుడు నీవందెంతయో భేదమును జూతువు. ఈలాగుననే ఈశ్వరానుభవజ్ఞులకు, ఈశ్వరతత్త్వమును బోధించుటకును, మనమునగాఢముగ నాటుకొలుపుటకును తర్కమును, బుద్ధివ్యవసాయమును, దృష్టాంతములును; అనవసరములు. వేదాంతులీ విషయము హస్తామలకమువలె నిశ్చయమై యొప్పుననియును, నీవునిలచి యీవిషయమిట్లుండుననని చెప్పఁజాలుదువనియు నుడువుచున్నారు. కావున ఈశ్వరానుభవము గలిగిన మానవులు నిలచి ఆత్మయిట్లుండునని చెప్పుదురు. నీవు వారితో సంవత్సరములుకొలఁదిగ వాదించినను వారు నీమాటను పాటిఁగొనక చిఱునగవు నవ్వుచు నీవాదమును వారి పిల్లల పలుకులవలె చూతురు. వారుపిల్లల [illegible]. వారు యీశ్వరుని కనుఁగొని దానిచే వారు పరిపూర్ణులై [illegible]న్నారు. నీవొక దేశమును జూచితి వనుకొనుము. ఇంకొకఁడొకడేతెంచి యాదేశమునొక్క యునికియే [illegible] లేదనినీతో వాదము సలిపిన, నాతఁడెంత [illegible] వాదించినను నీమనసటువైపు లొంగక యాదేశము [illegible]ర్థుండని స్పష్టముగ నుడువుచుండువు. ఈలాగుననే ఈశ్వరానుభవము నొందిన పురుషుఁడు ప్రాపంచిక మతవిషయముల [illegible] వాదములు. సూక్ష్మాతిసూక్ష్మము లన్నింటిని [illegible] భావించును. అనుభవమే మతముయొక్క ప్రాణము; [illegible]

మూలము. మతము పరిశోధింపఁ బడఁదగును. నీవు తెలిసి కొనుటకు సిద్ధముగ నున్నావా? నీవుదీనిని పరిశోధింప నెంతువా? నీవు ప్రయత్నింతువేని తెలిసికొందువు. అప్పుడు నీవు నిశ్చయ మతాత్మకుఁడ వగుదువు, నీవు అనుభవజ్ఞుఁడవగువఱకు నీకును, నిరీశ్వరవాదికిని యేమియు భేదముండఁజాలదు. కొంతవఱకు నిరీశ్వరవాదియే శ్రేష్ఠుఁడనిచెప్పిన బాగుండును. కాని యెవఁడు మతమునందు నమ్మకము గలవాఁడై, యనుభవప్రయత్నము నల్పకుండునో వాఁడసత్యుఁడును, అనృతుఁడునగును.

ఆవెనుకటి రెండవ ప్రశ్నమిది. ఈశ్వరానుభవము కలిగిన పిదప నేమగును? అనునదికూడ తెలియవలయును. మన మీ యేకత్వము నంతను తెలిసి కొంటిమి. అనఁగా మే మొక్కటే యనంతమైన పదార్థమని తెలిసికొంటి మనుకొనుఁడు. మఱియు మనమీ యాత్మయే సర్వ సృష్టియనిగూడ పరిశోధించితిమనియు, నీసృష్టియే తన్నుఁదాను ఈభిన్నావస్థలనుండు స్థూల పదార్థసమితి రూపమున వ్యక్తపరుచు చుండుననియు ననుకొనుఁడు. అయిన నటుపిమ్మట మన మేమగుదుము? నిర్వ్యాపారత్వ మొందుదుమా? ఒకచోనొదిగియుండి యచ్చటనే విశ్రమించి మృతినొందుదుమా? దీనిచే ప్రపంచమున కెట్టిలాభము కలుగును? ఇది యా వెనుకటి ప్రశ్నయే. ఆతఁడు ప్రపంచమున కేలరావలయును? తదాగమనమున కేదేని కారణముండునా? యనునదియే ముఖ్యవిషయము. దీనివలని యాశయ మేమి? దీని వలన విశ్వమున కేమి ప్రయోజనము? యని ప్రతిపురుషుఁడును ప్రశ్నింపవచ్చును. ఒక బాలుఁడు మిఠాయిని మెచ్చు

కొనుననియు, నీవువిద్యుచ్ఛాస్త్రవిషయిక పరిశోధనము నుత్సాహముమీఱ చేయుచుంటివనియు ననుకొనుము. ఆబాలుఁడు నిన్ను నీచేయుపని వలన మిఠాయివచ్చునా? యని ప్రశ్నించును. రాదని నీవు ప్రత్యుత్తర మొసంగుదువు. బాలుఁడు తిరిగి దీని వలన నేమిప్రయోజనము? అని ప్రశ్న చేయును. ఈలాగుననే మనుష్యులు నిలచి దీనివలన ప్రపంచమున కేమిఫలము? అనుచుందురు. దీనివలన ధనము లభించునా? లభింపదు. మరల దీనిలో నేమిగలదు? ప్రపంచమున కుపకారము సేయుట యందు మత పరిశీలనముఁగూడ లోకమున కన్ని విధము లైన లాభములను గలుగఁజేయుచున్నదని లోకు లభిప్రాయ పడుచున్నారు. ఒక్క యేకత్వము మాత్రమే యని మనకు, వ్యక్తమైన పిదప ప్రేమ సాగరమింకి నిర్జలమై పోవుననియు జీవితమునందలి ప్రతివస్తువయుఁ బోవుచుండుననియు, మనము ప్రేమించు యెల్లవస్తువులును ఈజన్మమునందును, రాఁబోవు జన్మములయందునుగూడ మనకై వినాశము నొందుననియు జనులు భీతావహులగుచున్నారు. తనస్థితిపై లేశమాత్రమై నను దృష్టిని సారించి విచారించిన మానవు లీప్రపంచమునం దన్నిటికంటెను మహోత్కృష్ట కార్యములఁ జేసిరనియును, లోకులభిప్రాయపడు చుండవచ్చును. తాను ప్రేమించు వస్తువు నీచమైనదియు, అనృత మైనదియు, నాశమొందు నదియుఁ గాదని తెలిసికొనినప్పుడే మనుష్యుఁడు నిశ్చయమైన మోహాతిరేకముచే ప్రేమించును. మానవుఁ డాతఁడు ప్రేమించు వస్తువొక మృత్కళేబరము కాక

యిదియే నిశ్చయమైన ఈశ్వరుఁడని గ్రహించునప్పుడే, దానిని నిశ్చయము, నిర్మలమునైన ప్రేమతోఁ జూచును. స్త్రీ తన పెనిమిటి నెక్కుడు మోహించుటచే నామె యాతఁడే స్వయంభువని తలంచును. భర్తకు భార్యయం దెక్కునగ ననురాగము గలుగునప్పు డాతఁడు ఆభార్యనె యీశ్వర సదృశముగ నెన్నును. తల్లి తన పుత్రుల నెక్కువ మక్కువతోఁ జూచునప్పు డామె వారినే భగవంతునిగఁ దలపోయును. తనకు ద్వేషాతిద్వేషుఁడైన వానినిఁ గూడ ప్రేమించెనేని యాద్వేషినె వాఁడీశ్వరసదృశముగఁ దెలియును. ఒకజ్ఞానిని మోహించునాతనికా జ్ఞానియె పరబ్రహ్మమను నమ్మకము కలుగును. ఆ మనుష్యుఁడె యొక పాపాతిపాపుఁడైన వానినిఁ గూడ ప్రేమించెనేని యాపాపాత్మునియందె యాతఁడా పరబ్రహ్మమును కనుఁగొనును. అట్టివాఁడె ఈ విశ్వము నద్భుతముగాఁ జూచును. ఏలయన:—ఆతనియందు స్వార్థము పోవుచు నాస్థానమును పరార్థమను పరబ్రహ్మము పొందుకొనియుండును. అతని ప్రేమలో నీవిశ్వమంతయు భిన్నావస్థం దాల్పఁగలదు. దుఃఖభాగులుగను, కష్టజీవులుగను జేయు వస్తుసమూహ మంతయు నదృశ్యమగును. మనోసంబంధమగు పోరాటములన్నియు నశించును. అనుదినమొక్క కబళమునకై కలహములు, జగడములు, పోట్లాటలు జరుగుచుండునట్టి చెఱసాలకు మారి ప్రపంచము మనకొక మహానందదాయకమైన క్రీడారంగమగును. ఈ ప్రపంచ మప్పుడంతయు రామణీయమై యొప్పును. అట్టివారు మాత్రమే నిలిచి ఈ ప్రపంచ మెంతయు రమణీయమై యున్నదని చెప్పఁజాలుదురు.

అట్టివారికే సాధారణముగ నీప్రపంచము మంచిదని చెప్పు వాక్కుగలిగియుండును. ఈ పరిశోధనమువలన విశ్వమునకెంతయు నధికమయిన మేలుకలుగును. ప్రపంచవృత్తము వాదోపవాదములతోడను, యుక్తిప్రయుక్తులతోడను గూడి సాగుచుండుటకు బదులుగ మానవులెల్లరును నేఁడా బ్రహ్మాండాత్మకమయిన ఈశ్వరత్వముయొక్క యొక యంశమునైనను కనుఁగొనినచో వెంటనె రూపాంతరము నొందును. తగవులు కలహములకు మారెల్లయెడల సౌఖ్యప్రదమగును. మనల నిర్బంధపఱచుచున్న నిరర్థకమును, నిష్ప్రయోజనమును, ఆటవికమునైన యుద్రేకము, ప్రతి మానవునినుండి తొలఁగి వేరై విశ్వమునుండి వీడువడి పోవుచుండును. దానితోడనే యెల్లయాశలుచు, ఓర్వలేమియు, మత్సరతయు మున్నగు నెల్లచెడుగులును నిరంతరము నదృశ్యములగును. ప్రపంచమునందలి మానవులెల్లరును దేవతలగుదురు. పిమ్మట నీ ప్ర పం చ మే స్వ ర్గ మ గు ను. దే వ త లు దేవతలతో నాటలాడు నప్పుడును, దేవతలు దేవతలతో వ్యవహారములు సలుపు నప్పుడును, దేవతలు దేవతలనే ప్రేమించు నప్పుడును నేచెడుగులు శేషింపఁజాలి యుండును? ఈశ్వరానుభవమువలన గలుగుమహాప్రయోజన మిదియే మీరు మీసంఘమున గాంచు ప్రతిపదార్థమును ప్రశాంతరము నొంది రెండవ రూపము దాల్చును; పిమ్మట మీకు మానవుని విషయమైన దురూహాయే జనింపకుండును. ఇదియే గొప్పదైన మొకటి ప్రయోజనము. మరల మీరెప్పుడును తప్పుచేసిన స్త్రీని గాని పురుషునిగాని నీచమైనదృష్టిని జూడకుందురు. నారీమణులారా!

పాపము రాత్రులయందు వీధిని సంచరించెడు బీదస్త్రీలను మీరు నీచమైన దృష్టితోఁ జూడకుందురు గాక. వారి యందును మీరాయీశ్వరునే జూతురు. మీకోర్వలేమి గాని, శిక్ష యను భావముగాని జనింపకుండును. ఆభావములన్నియు నశించును. మరియు నప్పుడే ప్రేమ యపారమగును. ఆప్రేమ సాధనమే యన్యసాధనాపేక్ష లేక మానవజాతిని క్రమమైన మార్గమున నడుపం జాలును.

ఈ ప్రపంచమునందలి స్త్రీపురుషులలో నొక కోట్యంశమైనను-జనులు నిలచి కొన్ని నిముసములకై యో మానవులలారా! ఓ జంతువులారా!! ఓప్రాణాధారులారా!!! మీరందఱు నీశ్వరులే యనియు, నా చిన్మయమూర్తియగు సృష్టికర్త యొక్క బాహ్యరూపములే యనియు పలుకుదురేని విశ్వ మంతయు నొక యరగంటలో మార్పు నొందును. ప్రతిదేశమునందలి జనులును, ప్రతికోశమునందు వెదజల్లు నీచము, ఓర్వలేమి, కలహము మున్నగు దుర్గుణబీజములెల్లను నశించి సర్వము బ్రహ్మమయమనియు, వారు చూచునదియు, స్పృశించునదియు గూడ నదియే యనియు తలంచుచుందురు. నీలో చెడుగు లేనప్పుడు నీవేల చెడుగును చూడఁగలవు? దొంగ నీ మనోమయకోశమున లేనప్పుడు నీవు వాని నేల చూడగలుగుదువు. నీవు స్వయముగ హంతకుఁడవు గానంత వఱకు నీ వేల హంతకుని జూడఁ జాలుదువు? నీవు సద్ధర్ముఁడ వగుదేని చెడుగులు తమంతతామే నీమానసిక సీమనుండి తరలుచుండును. ఈలాగుననే యెల్ల ప్రపంచమును మారిపోవును. సంఘ

మునకిది యొక మహోపయోగము. హింసా దేశములో ప్రా చీనకాలమునలో కులయభిప్రాయములివియే. వారువీని చే[illegible] నడుచుకొనుచుండిరి. గురువు లేకాంతము స్వీకరించుటకు చే[illegible] పరదేశపు దండయాత్రల వలనను నీభావములు వ్యాప్తమొం[illegible] జాలకుండెను. అయినను, నివియొక మహోత్కృష్టములు. [illegible] నాచరణయందునిచిన, మానవుడ ఖండ సచ్చి[illegible] యీశ్వరపదవిని బొందును. ఈలాటి యొక జ్ఞాని సహవాసము చే నాజీవితమంతయు మార్పుజెందినది. ఆవిషయము [illegible] వను నుపన్యాసమున) నేనురాబోవు నాదివారము [illegible] తును. ఈభావము లన్నియు ప్రపంచమునందు వ్యా[illegible] నప్పుడా వెనుకటి కాలముకూడ రావచ్చును. మరి[illegible] డుటకును, పండితులకడ వేదాంత గ్రంథములు [illegible] నొందుటకును, జాతిమతబంధములకు లోనై [illegible] పండిత ప్రముఖులకు శిష్యులై శుశ్రూషయొనర్చుటకు [illegible] నీభావబీజములన్నియు జ్ఞానాజ్ఞాన, పండిత, పామర, స్త్రీ పురుష, బాలురందఱియొక్క సమిష్టియాత్మయగు [illegible] యొక్క విశాల వక్షస్థలమున దట్టముగ నాటబడెను. [illegible] ప్రాపంచిక వాతావరణమును ఛేదించును; మనము [illegible] వాయువునందే ప్రతితరంగమునందును "[illegible] తత్త్వమసి యను మహావాక్యమును వ్య[illegible]

మఱియు, లక్ష్యోపలక్షల సూర్య, చంద్రాదులతోఁ గూడిన యీ స్థూల పదార్థసమిష్టియంతయు మాటలాడఁజాలు ప్రతిపదార్థరూపమున నైకకంఠ్యముగ "నీవుఁగూడనదియే" తత్త్వమసి యని చెప్పును

ఓం తత్సత్,



# శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల

## గార్ల - నైజాం.



సంపాదకుడు:
మాటేటి వరవరరావు.

మేనేజరు:
చిలుకూర శ్రీరాములు.



ప్రచారకుడు:
దాశరథి రంగయ్య.



[illegible] :
రక్తాక్షి సం॥ ఆశ్వయుజ శు॥ [illegible]

1924.



# ప్రధాన పోషకులు

---

మ. రా. రా. శ్రీ బందా భీమసేనరావుగారు,
రిలీవింగ్ స్టేషన్ మాస్టరు,
వరంగల్, నైజాం.

,, శ్రీమాన్ ఉద్దండరాయని వెంకటబుచ్చమా
చార్యులుగారు, కంట్రాక్టరు,
చిలుకోడు, నైజాం.

,, పరసా రామేశ్వరరావుగారు, మక్తేదారు,
కారేపల్లి, నైజాం.

,, చందా సత్యనారాయణగారు, షాహుకారు,
గార్ల, నైజాం.

---

# అభిమానులు

---

మ. రా. రా. శ్రీ ఆలూరు వేంకటచలపతిరావుగారు,
నాయబుఆబ్కారీ, మానుకోట.

,, సరికొండ వేంకటచలపతిరావుగారు,
దే॥ రాజవోలు.

,, జమలాపురపు వేంకటేశ్వరరావుగారు,
వకీలు, ఖమ్మంమెట్టు.

# రాజపోషకులు.

మ.రా.రా. శ్రీ మాటేటి వేంకటరామ నర్సింహారావుగారు దే॥ గార్ల నైజాం
,, వేంకటేశ్వరరావుగారు దే॥ ,, ,,
,, పుల్లఖండం కృష్ణయ్యగారు సాహుకారు ,, ,,
,, ,, సీతారామయ్యగారు ,, ,, ,,
,, ప్రభల రామబ్రహ్మానందముగారు తెనాలి
,, శ్రీ వేంకటేశ్వర గ్రంథాలయము. ,, ,,
,, పర్చూరంగారావు గారు మక్తేదారు కారేపల్లి ,,
,, పుల్లఖండం నరసింహముగారు సాహుకారు ,, ,,

---

# పోషకులు

మ.రా.రా. శ్రీ కలువల సీతరామరావుగారు దే॥ అచ్చుగూడెం నైజాం
,, శ్రీ భజనమందిరము మానుకోట
,, శ్రీమాన్ ఫణిహారం కేశవాచార్యులుగారు నేటివ్ డాక్టరు
,, మొరిశెట్టి లక్ష్మీనరసింహముగారు సాహుకారు ఇల్లందు
,, కొండపల్లి రత్నారావుగారు దే॥ బస్వాపురం
,, కేశిరాజు వెంకటకిషన్‌రావుగారు దే॥ పాతర్లపహాడు
,, నకిరెకంటి అప్పయ్యగారు సాహుకారు గార్ల
,, తుమ్మల పాపారావుగారు డోర్నకల్
,, చందా లింగయ్యగుప్తగారు డోర్నకల్
,, నాగబండి లచ్చయ్యగుప్తగారు ,,
,, పాలవాయి సత్యనారాయణగుప్తగారు ,,
,, గండి బుచ్చిరాములుగారు పోలీసుపటేల్ ,,
,, డాక్టరు వెంకటప్పయ్యగారు డోర్నకల్
,, కలకోట సీతయ్యగారు రాజవోలు
,, మాలె రాములుగారు ,,
,, మాలె సీతయ్యగారు ,,
,, గోరిపట్నపు చన్నయ్యాచార్యులుగారు బయ్యవరం
,, కొత్త రాములుగారు కొరిలి
,, శ్రీ పేరుంబూదూరు సర్సయ్యగారు రాజవోలు

# ప్రకటనలు.

## అమృతాంజనము

అన్ని నొప్పులకు దివ్యాంజనము.

వెల బుడ్డి రు. 0-10-0.

అమృతాంజనం డిపో

బొంబాయి. మద్రాసు.

---

త్వరపడుడు! త్వరపడుడు!!

ప్రథమకుసుమము.

## ముకుందమాల

గాంధిమహాత్ముఁడు ప్రతిప్రాతఃకాలమున నత్యంతప్రీతికరముగ భక్తియుక్తిమై పఠించునది. కులశేఖరాళ్వారులచే కూర్పబడినది. భక్తిరసము చిప్పిలు శ్లోకములు. ముద్దులొలుకు నాంధ్రీకరణము. ప్రతులైపోవచ్చినవి!!!

ధర తగ్గింపబడినది. వెల పావలామాత్రమే!

---

ద్వితీయకుసుమము.

## భర్తృహరినాటకము

మహాత్ముఁడగు భర్తృహరిచారిత్ర మింతవరకాంధ్రమున నెయ్యెడను గన్పింపకుండుట యొక్క గొప్పలోపము కాదా! ఆంధ్రనాటక స్వరూపమున మహానిపుణతతో వ్రాయబడినది! చూచి ధన్యతనొందుడు!!!

తరుణము మించిపోనీకుఁడు! వెల రూపాయిమాత్రమే!

తృతీయకుసుమము.

# సత్యాసత్యపురుషత్వము

శ్రీ వివేకానంద స్వాములవారి "The real and apparent man" అను గ్రంథమున కనువాదము. దీని ప్రాశస్త్యము జెప్ప బనిలేదు.

తప్పక ప్రతియాంధ్రుడు చదువదగినది!

వెల అర్ధరూపాయిమాత్రమే!

శ్రీ వేంకటేశ్వరగ్రంథమాల,

గార్ల — నైజాం.

---

# తిరుప్పావై

మార్గళియందు ముఖ్యముగను, ప్రతిదినమును ప్రతివైష్ణవ భక్తాగ్రేసరుడును పఠించి, ముక్తి గరతలామలకము జేసికొనగల్గున దీ గ్రంథమువలన మాత్రమే. శ్రీ గోదాదేవీ కృతద్రవిడ పాశురములకు చక్కనిటీక, శ్రీనివాస దేశికుల యాంధ్రీకరణము. పద్యములు, సప్తపదివృత్తములను పాటలు. త్వరపడుడు! ఆనందింపుడు! ప్రత్యక్షరాన్వయము సులభముగా తెలిసికొనదగును !!!

వెల మూడు పావలాలు !!!

---

# అనుబంధములు.

---

# ఆశ్రమచతుష్టయము

చక్కని శైలిగల యుపన్యాసము.

వెల రెండణాలు,

---

# శకుంతలాదుష్యంతము

## నాటకము.

మహాకవి కాళిదాసు "అభిజ్ఞాన శాకుంతలము"నకు చక్కని యాంధ్రీకరణము. ప్రదర్శనానుకూలము. మహామృదుమధుర గంభీరభావభరితము.

గ్రంథకర్త: చిలుకూరు శ్రీరాములుగారు, ప్రధానోపాధ్యాయులు.

అన్వారియా కమిటీస్కూల్, గార్ల—నైజాం.

---

# గయోపాఖ్యానము

## అబ్బురపు ప్రబంధరాజము.

శైలియు, పదములును, భావములును, కవితాపటిమయు ననిర్వచనీయములు. ఇంతవరకెచ్చటను వెల్వడియుండలేదు. పురాతన కవికృతము. పుణ్యకథావిలసితము.

వలయువారు:—శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల,
గార్ల—నైజాం (అని వ్రాయవలెను.)

---

# తెనుగు పత్రిక

శ్రీ నిజామురాజ్యమునందలి ౨౦ లక్షల యాంధ్రుల యభివృద్ధి కొరకు పాటుబడునదిది యొక్కటే పత్రికారాజము. తెలిసికొనదగిన, నేర్చుకొనదగిన, అవలంబింపదగిన అనుష్ఠింపదగిన యమూల్యవిషయములెన్నియో ప్రతివారము ప్రకటింపబడును. ఆంధ్రులహస్తముల నలంకరింపదగిన యీ తెనుగువారపత్రిక ౧౨ పెద్దరాయల్ పుటలతో ప్రత్యాదివారము వెడలుచుండును. చందా సంవత్సరమునకు రు 3—12—0

ప్రకటన చేయింప నెంచు వర్తకులు రేట్లు మాకు వ్రాసి కనుగొనవచ్చును.

తెనుగుపత్రిక, ఇనుగుర్తి (నైజాం)

---